# జఖ్మీ ఆవాజ్

## తెలంగాణ కవిత్వం - వ్యాసాలు

స్కైబాబ

ప్రచురణ

తెలంగాణ ముస్లిం రచయితల వేదిక

'సింగిడి' తెలంగాణ రచయితల వేదిక

zakhmee aawaaz

Telangana Poetry & Essays

by

Sky Baaba



April, 2012

1433 Hijri

Cover Drawing & Disign

Akbar

Publication

Telangana Muslim Writers Forum

Singidi Telangana Writers organization

For copies

• SKY Baaba

10-1-639, Chintal Basti

Khairathabad, Hyderabad-4

Cell: 99859 21379, 98854 20027

E-mail: skybaaba@gmail.com

htpp://skybaaba.blogspot.com

facebook/skybaaba

• available at all literary book Centers

Price: 30/-

Printed at Anupama Printers

126, Shantinagar, Hyderabad-28

Ph: 040-23391364

బందగీ.. షోయబుల్లా ఖాన్

పోలీస్ యాక్షన్‌లో ప్రాణాలు కోల్పోయినవారికి..

దేశ విభజన-పోలీస్ యాక్షన్ సమయాల్లో

అతలాకుతలమైనవారికి..

గత 64 ఏళ్లుగా చితికిన బతుకులీడుస్తున్న ముస్లింలకు..

ముఖ్యంగా హిందూత్వవాదుల విష ప్రచారాల వల్ల

గాయపడుతున్న ముస్లిం సోదరులకు..

ఈ జఖ్మీ ఆవాజ్..

## తెలంగాణ ఉద్యమాభివందనాలు

ఈ కవితలకు, వ్యాసాలకు ప్రత్యక్షంగా, పరోక్షంగా

సాయపడ్డ సుంకిరెడ్డి నారాయణరెడ్డి, కాసుల ప్రతాపరెడ్డి,

సంగిశెట్టి శ్రీనివాస్, వేముల ఎల్లయ్య, షాజహానా, అక్బర్, ఖాజా

పుస్తకం వేయడానికి ఆర్థిక సాయం చేసిన తెలంగాణ బ్లాక్

వాయిస్ మిత్రులకు షుక్రియా..




తెలంగాణ బ్లాక్ వాయిస్
(ఫేస్‌బుక్ యూజర్)
ఆర్థిక సాయంతో...

# తెలంగాణ గుల్‌సితాం హమారా!

ఒక అందమైన తోట / ఆ తోటలో రకరకాల పూలు / రంగురంగుల పూలు
గులాబీలు మందారాలు చమేలీలు / మొగలిపూలు బంతిపూలు గుల్‌మొహర్‌లు
అన్నిరకాల పూలతో / చాలా అందంగా కనబడుతోందా తోట
అయితే / ఆ పూలన్నింటినీ నలిపేసి తొక్కేసి నరికేసి
ఒక్క కమలమే విస్తరించాలంటే / ఆ తోట అందమంతా ఏమైపోతుంది ?!

అని ముస్లింలుగా మేం ప్రశ్నిస్తున్నాం. తెలంగాణ ఒక 'గుల్‌సితాం'! దాన్ని ధ్వంసం చేసే అవకాశం మతోన్మాదులకు ఇవ్వవద్దని ఆక్రోశిస్తున్నాం. ముస్లింల మీద విషప్రచారాలతో బిజెపి ఓట్లు పొందాలని చూస్తుండడాన్ని ఖండించాలని కోరుతున్నాం. కావాలని మతఘర్షణలు రెచ్చగొట్టాలని ఆ పార్టీ ఇప్పటికే ప్రయత్నిస్తోంది.

1948లో పోలీస్ యాక్షన్ దగ్గరి నుంచి ముస్లింల సర్వనాశనం మొదలైంది. ఇవాళ వారి బతుకులు 'చిల్లర'గా మారిపోడానికి ఎన్నో కారణాలు. భాషను నాశనం చేయడం, భూములు కోల్పోవడం, ఆస్తుల ధ్వంసం, వృత్తులు లేకపోవడం, రిజర్వేషన్లు లేకపోవడం, ఇలా ఎన్నో..! ఇవాళ అన్నింటి మీదా చర్చ జరగాలి. మొదటి నుంచి జరిగిన అన్యాయాలకు తెలంగాణ ఉద్యమంలో భాగంగా, తెలంగాణ సాధన తరువాత పరిహారం దొరకాలి. కమ్యూనిస్టులుగానీ, మరొకరు గానీ రజాకార్ల పేరుతో ముస్లింలపై దౌర్జన్యాలు చేశారు. ఆ లెక్కలన్నీ బైటికి రావలసి ఉంది. అట్లే పోలీస్ యాక్షన్‌లో 50 వేల నుంచి 2 లక్షల మంది ముస్లింలు చంపబడ్డారని తెలిసి హతాశులయ్యాం. దోపిడీలు, మానభంగాలు, ఆస్తుల ఆక్రమణలు ఎన్నో! అప్పుడు నష్టపోయిన వారికి ఏ నష్టపరిహారం అందజేద్దాం?

తెలంగాణ వస్తే భాషాపరంగా, సంస్కృతి పరంగా, అన్ని రకాలుగా నష్టపోయిన, పోతున్న ముస్లింలకు మేలు జరుగుతుందనే ఉత్తేజంతోనే ఉద్యమంలో మా వంతుగా పనిచేస్తున్నాం. కాని ఉంటాఉంటే ఒక నరమాంస భక్షక పార్టీ లబ్ధి పొందే అవకాశాన్ని ఇవ్వడానికి కూడా కొందరు సిద్ధపడడాన్ని మేము

వ్యతిరేకిస్తున్నాం. గుజరాత్‌లో ఏం జరిగిందో, ఈ క్రూర మృగాలు ఎంత వికృతంగా ప్రవర్తించాయో 13 రోజులు ఊరూరా తిరిగి చూసివచ్చినవాణ్ణి నేను. తెలంగాణ పేరుతో ఆ నరహంతక పార్టీకి అవకాశం ఇవ్వడాన్ని ఎట్టి పరిస్థితుల్లోనూ మేం ఒప్పుకోలేం.

ఇవాళ ఆఖరికి కమ్యూనిస్టులు, వీర విప్లవ పార్టీలు సైతం బిజెపితో చెట్టాపట్టాలేసుకు తిరగడం చూస్తే సిగ్గేస్తోంది. వాళ్లకు లేకపోవచ్చు గానీ మాకు ఆత్మాభిమానాలున్నాయి. కాబట్టి అందరికందరూ బిజెపి, ఆర్‌ఎస్‌ఎస్ విషయంలో అప్రమత్తంగా ఉండాలని హెచ్చరిస్తున్నాం. బిజెపి ఇచ్చే తెలంగాణ మాకు వద్దే వద్దని సైరన్ మోగిస్తున్నాం. ఆ సందర్భంగానే మా 'గాయపడ్డ గొంతుక'ను ముస్లింల గురించి చర్చ జరగడానికి ఒక వాహికగా మీ ముందుకు తీసుకొస్తున్నాను.తెలంగాణలో 15 శాతంగా ఉన్న అతి పెద్ద సమూహమైన ముస్లింలను ఉద్యమంలో ఒంటరి చేసే కుట్రలను తిప్పికొట్టాలని పిలుపునిస్తున్నాం...

మీరూ మీరూ 'హిందువులు' కాబట్టి ఇమిడియేట్‌గా మీకే ప్రమాదం లేదు కాబట్టి మీకేం అనిపించకపోవచ్చు. కాని ముస్లింలుగా మా భయాలు మాకున్నాయి. మేం నరహంతక పార్టీలను, సంస్థలను నమ్మలేం.. నమ్మం. ఈ సందర్భంగా జర్మనీ తత్వవేత్త ఫాస్టర్ నీమెల్లర్ అన్న మాటలూ అందరికీ వర్తిస్తాయని ఒకసారి మీ అందరికీ గుర్తు చేస్తున్నాను..

మొదట వాళ్ళు యూదుల కోసం వచ్చారు
యూదుని కాదు గనుక నేను మాట్లాడలేదు
తర్వాత వాళ్ళు కమ్యూనిస్టుల కోసం వచ్చారు
కమ్యూనిస్టును కాదు గనుక నేను మాట్లాడలేదు
తర్వాత వాళ్ళు క్యాథలిక్కుల కోసం వచ్చారు
క్యాథలిక్కును కాదు గనుక నేను మాట్లాడలేదు
తర్వాత వాళ్ళు నా కోసమే వచ్చారు
నా కోసం మాట్లాడేందుకు అప్పటికెవరూ మిగల్లేదు

– స్కైబాబ

20.04.2012



# చేతులు కాలాక ఆకులు పట్టుకోలేం!

తెలంగాణ! ఒక అణచివేతలోంచి చారిత్రక అవసరంగా పుట్టుకొచ్చిన ఉద్యమం. తెలంగాణ ఇప్పుడొక నిప్పుల గుండం!

తెలంగాణ ఉద్యమం ప్రపంచంలోనే సుదీర్ఘకాలం కొనసాగుతున్న ఉద్యమం. నిజానికి ఇంత దీర్ఘకాలం జరిగిన ఏ ఉద్యమమైనా రక్తపాతానికి దారితీస్తుంది. కాని మన తెలంగాణ ఉద్యమం ఇంతదాకా ఒక శాంతియుతమైన ఉద్యమంగానే కొనసాగుతుండడం విశేషం. ఆ గొప్పతనమంతా తెలంగాణ ఉద్యమంలో పాల్గొంటున్న సామాన్య ప్రజలకే దక్కుతుంది. ఈ మూడేళ్లలో ఉద్యమం తారాస్థాయికి చేరుకుంది. ఏ మలుపు తీసుకోబోతుందోననే దశకు చేరుకుంది. ఈ దశలో ఉద్యమం సాగుతున్న దారి సరైందేనా? అని ప్రశ్నించుకోవాల్సిన అవసరముంది.

తెలంగాణలో ఒక పెద్ద సమూహం ముస్లింలు. వారి తరఫున మేము ఎప్పటికప్పుడు కొన్ని ముఖ్యమైన ప్రశ్నలు లేవనెత్తుతూనే ఉన్నాం. కాని ఎప్పటికప్పుడు వాటిని పట్టించుకోకుండా విస్మరించడం జరుగుతున్నది. అది మమ్మల్ని బాధిస్తున్నది. తెలంగాణలో ముస్లింల గురించి, దళిత బహుజనుల గురించి మాట్లాడుకోకుండా జరిగే ఏ చర్చ అయినా అది అసంపూర్ణమై నటువంటి అంశంగానే మిగిలిపోతుంది. ఇక్కడ జరిగిన అన్ని ఉద్యమాల్లోనూ ముస్లింల, దళిత బహుజనుల పాత్ర ఉంది. నేటి తెలంగాణ ఉద్యమంలో ముస్లింలను విస్మరిస్తూ భవిష్యత్ తెలంగాణ గురించి ముస్లింలను భయాందోళనలకు గురిచేసే పరిస్థితి కల్పిస్తా ఉన్నారు.

హైదరాబాద్ రాజ్యం వందల ఏండ్లు ఎందరో ముస్లిం రాజుల పాలనలో ఉంది. చివరి నిజాం పాలనలోని చివరి సంవత్సరాల్లో జరిగిన విషయాలను

ప్రచారం చేస్తూ మొత్తం పాలనను విమర్శిస్తూ పరోక్షంగా ముస్లిం వ్యతిరేకతను పెంచిపోషిస్తున్నవారిలో కమ్యూనిస్టులూ ఉండడం విచారకరం. ఆ విషయంలో ఇప్పటికీ నిజానిజాలు వెలికితీసే ప్రయత్నం జరగలేదు. ఇప్పటికీ అలాంటి ఒక వేర్పాటు ముద్రని తెలంగాణ ముస్లిం సమాజం మొత్తం మోస్తా ఉంది.

తెలంగాణ సమాజం నిర్మాణంలో ముస్లింల పాత్ర ఉంది. ముస్లింల భాగస్వామ్యం ఉంది. ఒక ముస్లిం రాజే హైదరాబాద్ నగరాన్ని నిర్మించడాన్ని మరవలేము. అన్ని సదుపాయాలు కలిగిన నగరంగా హైదరాబాద్‌ను తీర్చి దిద్దింది కూడా ముస్లిం రాజులే. ప్రజల అవసరాలను వారు గుర్తించి అన్ని సదుపాయాలు కల్పించారు. ఈ విషయాలు మాత్రం కమ్యూనిస్టులుగానీ, బిజెపిలాంటి వారుగానీ ఎందుకు గుర్తించరు? కేవలం సంగిశెట్టి లాంటివారు, సుంకిరెడ్డి లాంటివారే ఈ విషయాలు మాట్లాడుతుండడం విశేషం. ముస్లిం రాజులను దుర్మార్గులుగా చిత్రించడం ద్వారా మొత్తం ముస్లిం సమాజాన్ని దుర్మార్గులుగా చిత్రించే ప్రయత్నంగా ఇది కనిపిస్తా ఉంది. తెలంగాణ విద్రోహి అంటే నిజాం మాత్రమే అనే పోకడ కనిపిస్తా ఉంది. ఇది కుట్రలో భాగమే.

మొదటి నుంచి టిఆర్‌ఎస్ ముస్లింల, దళిత బహుజనుల విషయంలో స్పష్టత ఇవ్వకుండా వచ్చింది. మొదట్లో హిందూత్వ దృక్పథంతో ముందుకు సాగడం కనిపించింది. తరువాత కెసిఆర్ ఒక మతాతీత, కులాతీత వ్యక్తిలాగా వ్యవహరించకుండా యజ్ఞాలు, యాగాలు చేస్తూ వాటిని ఉద్యమంతో ముడి పెట్టడం జరిగింది. తరువాత ఉద్యమంలో భాగస్వాములైనటువంటి సంస్థలు కూడా ముస్లింలు, దళిత బహుజనుల విషయంలో ఒక స్పష్టత ఇవ్వకుండానే ముందుకు వెళ్లడం జరుగుతున్నది. ఉద్యమంలో ముస్లింలుగా మేము కూడా భాగస్వాములుగా ఉన్నప్పటికీ మా మనోభావాలు ఎవరూ పట్టించుకున్నది లేదు. మా ఆలోచనల్ని, అభిప్రాయాల్ని సభలూ సమావేశాల్లో చెప్పించాం. ప్రశ్నలు వేశాం. కాని టిఆర్‌ఎస్ గానీ, ఏ ఇతర సంస్థలు గానీ మా ప్రశ్నలకు సమాధానం చెప్పలేదు.

చివరికి గద్దర్ పాడిన 'నైజాము సర్కరోడా' పాట ప్రతాపరెడ్డి అనే ఒక దొర మీద రాసిన పాట అని మేము చర్చ చేయాల్సిన గత్యంతరం మాకు పట్టించారు. ఈ పాట పాడడం ద్వారా తెలంగాణ ఉద్యమంలోకి వస్తున్న ముస్లింల మనోభావాలు దెబ్బతినే అవకాశం ఉంది అనే కనీస జ్ఞానం కూడా 'ధూం ధాం'లలో పాల్గొనే విప్లవ గాయకులు గ్రహించపోవడం విచారకరం.



ఇవాళ ముస్లిం ఆలోచనాపరులు, దళిత బహుజన మేధావులు తెలంగాణ ఉద్యమ నాయకులను అనుమానించే పరిస్థితిని చూస్తున్నాం. ముస్లింలను కూర్చోబెట్టండి. దళిత బహుజనుల్ని కూర్చోబెట్టండి. మీరేమనుకుంటున్నారు? మీ భయాలేంటి? మేము చేస్తున్న తప్పేంటి? అని అన్ని విషయాలు చర్చించుకోవాల్సిన అవసరముంది. అప్పుడే బలమైన సమూహాలైన ముస్లింలు, దళిత బహుజనులు పూర్తి స్థాయిలో ఉద్యమంలో భాగస్వాములవుతారు.

ఇక మహబూబ్‌నగర్‌లో ముస్లిం అభ్యర్థి ఓటమి, ఉస్మానియా యూనివర్సిటీలో పెద్దకూర పండగ పైన జరిగిన, జరుగుతున్న దాడి భవిష్యత్ తెలంగాణ ఇలా ఉండబోతాంది అనే ఒక సంకేతం ఇస్తాంది. మహబూబ్‌నగర్‌లో ముస్లిం అభ్యర్థి ఓడిపోవడం ద్వారా మరెక్కడైనా ముస్లిం అభ్యర్థిని పెడితే గెలవడేమో అనే సంకేతాన్ని ఇవ్వడం ద్వారా ముస్లింలకు టిక్కెట్లే ఇవ్వని పరిస్థితిని టిఆర్‌ఎస్ కల్పించింది. తెలంగాణ సాధన, ముస్లింల వైఫల్యం అనే దిశగా తీసుకెళ్లే ప్రయత్నం అది. దీనికి కెసిఆర్ బాధ్యత వహిస్తారా? కోదండరాం వహిస్తారా? తేలాల్సి ఉంది. అక్కడ ముస్లిం అభ్యర్థి పోటీలో ఉన్నాడని తెలిసి కూడా తెలంగాణ వాదాన్ని గెలిపించండి అని చెప్పడం ద్వారా 'అశ్వత్థామ అతహ' అని పెద్దగా చెప్పి 'కుంజరహ' అని 'ముస్లిం అభ్యర్థిని ఓడించండి' అని చెప్పినట్లుగా మేం అర్థం చేసుకోవాలా? ఈ విషయంలో ముస్లిం సమాజానికి వీళ్లు క్షమాపణ చెప్పాల్సిన అవసరముంది. తెలంగాణ ఉద్యమంలో ముస్లింలను భాగస్వాములుగా చేసుకోవాల్సిన సందర్భం ఉంది. తెలంగాణ సాధన ముస్లింలకు వ్యతిరేకంగా జరిగేటట్టయితే, ముస్లింలను దొంగ దెబ్బ తీసేట్టయితే, అలాంటి తెలంగాణ ముస్లింలకు అక్కర లేదు. ముస్లింలకు కావలసింది సెక్యులర్ తెలంగాణ. స్నేహపూర్వకమైన తెలంగాణ. అన్నింట్లో భాగస్వామ్యముండే తెలంగాణ.

తెలంగాణ ఉద్యమంలో కీలకమైన శక్తులు దళిత బహుజనులు. ఎవరి ఆత్మగౌరవాన్ని వారు కాపాడుకునే పరిస్థితి, ఎవరి సాంస్కృతిక జీవనాన్ని వాళ్లు కాపాడుకునే పరిస్థితి ఉన్నటువంటి తెలంగాణనే దళిత బహుజనులు కూడా కోరుకుంటున్నారు. ఎందుకంటే ఈ అభద్రత ముస్లింలకు ఒక్కరికే ఉంది. దళిత బహుజనులకు లేదు. వాళ్లు హిందువులు కాబట్టి అని అనుకోవడానికి లేకుండా ఉస్మానియా యూనివర్సిటీలో జరిగిన పెద్దకూర పండుగ నిరూపించింది. దళిత బహుజనులు సాంస్కృతికంగా తమ ఐడెంటీటీనీ కాపాడుకునే ప్రయత్నం చేస్తే

తెలంగాణ ఉద్యమంలో వాళ్ల భాగస్వామ్యులైనప్పటికీ కూడా హిందూత్వ శక్తులు వాళ్లను వదిలిపెట్టవు అని పెద్దకూర పండగ సందర్భంగా జరిగినటువంటి దాడులు నిరూపించాయి. సో.. దళిత బహుజనులారా! మీరు హిందువులుగా ఉంటే ఉండండి. హిందూత్వ ఫోర్స్‌లో భాగంగా ఉండండి గానీ మీ సొంత ఐడెంటిటీతో ఉండడానికి వీల్లేదు అనేటువంటిదాన్ని ఇక్కడ హిందూత్వ శక్తులు ప్రదర్శించి చూపించాయి. బిజెపి గెలుపుకి సహకరిస్తున్న కృష్ణమాదిగ లాంటి వారు తాము హిందువులా? హిందూత్వ శక్తులకు సహకరించేవాళ్లా? లేదా ప్రత్యేక అస్తిత్వం కలిగినటువంటి మూలవాసులా? ఇక్కడి ఇతర బలహీన శక్తులతో కలిసి పోరాడాల్సినవాళ్లా? తేల్చుకోవాల్సి ఉంది. మొత్తంగా తెలంగాణలోని నాయకత్వం అందరిలోనూ ముస్లిం వ్యతిరేకత, దళిత బహుజన వ్యతిరేకత ఉందా? లేదూ వారిని కలుపుకునే పరిస్థితిలో ఉన్నారా? అనేది స్పష్టం కావాలి. గద్దర్ లాంటి నాయకులు కూడా ఇలాంటి సందర్భాల్లో ముస్లింలు, బహుజనుల వైపు నిలబడ్డట్టు ఒక స్టేట్‌మెంట్ ఇవ్వడంగానీ, ఒక కార్యాచరణ రూపొందించడంగానీ చెయ్యకపోవడం దారుణం.

ఇవాళ కొత్తగా హనుమాన్ జయంతి పెద్ద కార్యక్రమంగా జరుగుతోంది. ఎన్నో బహుజన సంఘాలు, కమ్యూనిస్టు సంఘాలు కూడా ఈ కార్యక్రమాల్లో పాల్గొంటున్నాయి. తెలంగాణ ఉద్యమం బలపడ్డ సందర్భంలోనే వీటిని మనం చూస్తున్నాం. దీని వల్ల మనం ఏ దిశంగా ప్రయాణిస్తున్నాం? తెలంగాణ వస్తే ఏ శక్తులు తెలంగాణలో బలం పుంజుకుంటాయి? ఏ శక్తులు ఆధిపత్యం చెలాయిస్తాయి? ఎవరిని అణిచివేస్తాయి? అనే ప్రశ్నలకు సమాధానాలు వెతకాల్సిన అవసరం ఈ సందర్భంలోనే ఉంది. చేతులు కాలాక ఆకులు పట్టుకోవడానికి మేం సిద్ధంగా లేము.

ఇలాంటి సందర్భంలో స్కైబాబ తెస్తున్న ఈ పుస్తకం తెలంగాణ సాధన ఉద్యమంలో ముస్లింలు ఏం కోరుకుంటున్నారు అనే విషయాల్ని చర్చిస్తున్నది. ఈ పుస్తకం వాహికగా తెలంగాణ ముస్లింల మనోభావాలకు సంబంధించి చర్చ జరగాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

– ఖాజా

19.04.2012



# చాంద్ తారల్నే కాదు..
# అగ్గి పిడుగుల్ని కురిపించే 'స్కై'

మొన్నటి మహబూబ్‌నగర్ ఉప ఎన్నికల ఫలితాలు ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో ఒక కీలకమలుపు. ఆ మలుపు తెలంగాణ సాధనకు దగ్గరి దారి అని బిజేపీ, దానితో అంటకాగే కొన్ని 'ఉద్యమ' సంస్థలు ప్రకటించాయి. ప్రత్యర్థి గెలిచినా ఆత్మపరిశీలన చేసుకోకుండా ఉప ఎన్నికల్లో తెలంగాణ వాదమే గెలిచిందని టీఆరెస్ సంతోషంతో చెప్పుకొచ్చింది. బీజేపి గెలుపుతో తెలంగాణ ఉద్యమం డెడ్‌ఎండ్ వైపు దారి తీసిందని, తీస్తుందని 'సెక్యులర్' తెలంగాణ వాదులు, ముస్లిం సంస్థలు అభిప్రాయపడ్డాయి. ముస్లిం రచయితలు, విద్యావంతులు మరో అడుగు ముందుకేసి బీజేపీ మూలంగా వచ్చే 'మతతత్వ తెలంగాణ' మాకు వద్దే వద్దు అని కుండబద్దలు కొట్టిండ్రు. ఇందులో రెండు మూడు విషయాలు ఇమిడి ఉన్నాయి. మొదటిది బీజేపీ అధికారంలోకి రావాలంటే 2014 వరకు ఆగాలి. ఆగినా బీజేపీ కచ్చితంగా

బీజేపీ అధికారంలోకి రావాలంటే 2014 వరకు ఆగాలి. ఆగినా బీజేపీ కచ్చితంగా అధికారంలోకి వస్తుందనే గ్యారంటీ లేదు. ఒక వేళ 2014 వరకు ఆగినా, బీజేపీ అధికారంలోకి వచ్చినా అది స్వతంత్రంగా ప్రభుత్వాన్ని ఏర్పాటు చెయ్యగలగాలి. అది ప్రభుత్వాన్ని ఏర్పాటు చెయ్యడానికి సీమాంధ్రలోని 25 సీట్లలో బహుశా మెజారిటీ సీట్లు గెలువనున్న వైఎస్ఆర్ పార్టీ మద్దతు అవసరం లేని పరిస్థితి ఉండాలి. ఇవన్నీ కలగలిసి ఒకవేళ బీజేపీ తెలంగాణను ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేస్తే ముస్లింలుగా దాన్ని తాము కచ్చితంగా వ్యతిరేకిస్తామని నిఖార్సయిన తెలంగాణ వాది స్కైబాబ 'గాయపడ్డ గొంతుక'తో స్కైబాబ చెప్పిండు.

అంతకుముందు గుజరాత్‌లో జరిగిన మారణహోమాన్ని దగ్గరుండి చూసిన అనుభవంతో, బీజేపీ ఇచ్చే తెలంగాణలో సెకండ్ గ్రేడ్ సిటిజన్‌లాగానే బతకాల్సొస్తదని స్కైబాబ ఉద్దేశ్యం. బీజేపీ కన్నా సీమాంధ్రుల వలస పాలన వందరెట్లు నయం అని ఆయన అంచనా! ఈ విషయాల్ని కన్విన్సింగ్‌గా తన వ్యాసాల్లో చెప్పిండు.

1969లో కాసు బ్రహ్మానందరెడ్డి ప్రలోభాలకు లొంగి ప్రత్యేక తెలంగాణకు వ్యతిరేకంగా వ్యవహరించిన సుల్తాన్ సలాఉద్దీన్ ఓవైసీ ఆయన పార్టీ, మలిదశ ఉద్యమంలో రాజశేఖరరెడ్డితో అంటకాగి చివరికి 'రాయల తెలంగాణ' దాకా వచ్చి ఆగింది. మజ్లిస్ పార్టీ 'జై తెలంగాణ' అనకుండా 'రాయల-తెలంగాణ' అనడానికి పూర్తిగా తెలంగాణ ఉద్యమానిది, దాన్ని ఒంటెత్తు పోకడలతో నడిపిస్తున్న నాయకత్వానిదే బాధ్యత. ఎందుకంటే 1992లో రాజశేఖరరెడ్డి తాను ముఖ్యమంత్రి కావడానికి, చెన్నారెడ్డిని గద్దె దించడానికి హైదరాబాద్‌లో మతకలహాలు సృష్టించిన సమయంలో మజ్లిస్ పార్టీ తెలంగాణ ప్రజల వైపు నిలబడింది. 1992లో తెలంగాణలో అభివృద్ధి అనే అంశంపై అసెంబ్లీలో జరిగిన చర్చలో మజ్లిస్ పాల్గొంది. తెలంగాణ అభివృద్ధికి సీమాంధ్ర వలస పాలకుల వైఖరిని తప్పుబట్టిన విషయం ఆనాటి అసెంబ్లీ ప్రొసీడింగ్స్ చూస్తే విషయం క్లియర్‌గా అర్థమయితది. అసెంబ్లీలో తెలంగాణకు జరుగుతున్న అన్యాయాల్ని, 'గ్లోబలైజేషన్' వెలుగులో హైదరాబాద్ వనరుల దోపిడీని నిలదీసింది. తమ పాత స్టాండ్‌ని మార్చుకొని అందరికన్నా ముందుగ ప్రత్యేక తెలంగాణ వైపు అడుగులేస్తున్న మజ్లిస్‌ని ఆనాడు ఏ తెలంగాణ వాదీ తమ వాడిగా అలయి బలయి



తీసుకోలేదు. అయితే ఈ అవకాశాన్ని తర్వాతి కాలంలో రాజశేఖరరెడ్డి తన స్వీయ రాజకీయ ప్రయోజనాలకు సమర్థవంతంగా వినియోగించుకుండు. దాని ఫలితమే ఇవ్వాళటి 'రాయల తెలంగాణ' నినాదం. తెలంగాణలోని పది జిల్లల ముస్లింలందరూ మజ్లిస్ పార్టీతో లేకపోవచ్చు. కాని మజ్లిస్ పార్టీ ముస్లింల ప్రయోజనాలకోసం కొట్లాడుతదనే నమ్మకం మాత్రం వారికుంది. ఈ నమ్మకానికి తెలంగాణ వాదులు/పార్టీలు ఏమాత్రం గౌరవం ఇవ్వకుండా, ఆ పార్టీ అభిప్రాయంతో సంబంధం లేకుండా ఉద్యమాలు చేస్తున్నాయి. అంతెందుకు ఉర్దూ ఛానళ్లలో తెలంగాణ వాదాన్ని వినిపించే సమర్థవంతమైన ఒక 'గ్రూప్'ని అటు జేఏసీ గానీ, ఇటు టీఆర్ఎస్ గాని, మరే ప్రజాస్వామిక 'ఫ్రంటు'గానీ ఏర్పాటు చేసుకోలేకపోయాయి. ఉర్దూ మీడియా తమకు అంటరానిదిగానే, దానితో అవసరం లేదు అనే విధంగానే ఇవి వ్యవహరిస్తున్నాయి. ఇట్లాంటి పరిస్థితుల్లో తెలంగాణ ఉద్యమంలో, వేదికల మీద, మీడియా ముంగిట ముస్లింలకు జనాభా దామాషాలో వారికి దక్కాల్సిన వాటా కచ్చితంగా దక్కాలి. మజ్లిస్ కేవలం హైదరాబాద్‌కు మాత్రమే పరిమితమైన పార్టీ అనే నెపంతో దాన్ని పట్టించుకోనట్లయితే అది సమీప భవిష్యత్‌లో తెలంగాణకు తీరని నష్టం కలిగిస్తది. ఇంకా నిర్దిష్టంగా చెప్పాలంటే 2014 లోపల తెలంగాణ సాధించుకోనట్లయితే ఒక వైపు బీజేపీ, మరో వైపు మజ్లిస్‌లు ఆ ఎన్నికల్లో తెలంగాణ ఆకాంక్షకు గండి కొట్టే ప్రమాదముంది. ఈ పార్టీలు 2014లో మతం కార్డుతో పోటీకి దిగి తాము గెలువకున్నా తెలంగాణ వాదులకు పడాల్సిన ఓట్లను చీల్చి కాంగ్రెస్, తెలుగుదేశం విజయాలకు పరోక్షంగా తోడ్పడే ప్రమాదముంది. అందుకే అందరినీ కలుపుకొని తెలంగాణ తెచ్చుకోవాల్సిన అవసరముంది.

ముస్లింలందరూ మజ్లిస్‌తో లేకపోయినప్పటికీ చట్ట సభల్లో ఇవ్వాళ తెలంగాణ నుంచి గెలిచిన ముస్లింలు కేవలం మజ్లిస్ పార్టీ వారే అనే విషయాన్ని లెక్కలోకి తీసుకోవాలి. ఏడుగురు మజ్లిస్ ఎమ్మెల్యేలు, ఒక్క పార్లమెంటేరియన్ మినహా తెలంగాణ నుంచి మరే ముస్లింకు అసెంబ్లీలో, పార్లమెంటులో ప్రాతినిధ్యం లేదు. అసెంబ్లీకి రెండు సార్లు పోటీ చేసినా తెలంగాణ వాదం పేరిట షబ్బీర్ అలీని న్యాయంగా ఓడించిండ్రు బోధన్/ఎల్లారెడ్డి నియోజకవర్గ ప్రజలు. అలాగే తమకిష్టం లేకున్నా యెండల లక్ష్మినారాయణను నిజామాబాద్ నుంచి గెలిపించిండ్రు ముస్లింలు.

ఇట్లాంటి పరిస్థితుల్లో మొన్నటి ఉప ఎన్నికల్లో మహబూబ్‌నగర్ నుంచి టీఆర్ఎస్ ఒక ముస్లింకు టికెటిస్తే దాన్ని మతవాద ప్రచారంతోటి 'రజకార్ల రాజ్యం' వస్తదని జెప్పి బీజేపి గెలుచుకుంది. హిందూత్వ వాదానికి పరోక్షంగా ఊపిరి పోస్తూ కొంత మంది బిజేపీని గెలిపించాలనే కుట్రతోనే టీఆర్ఎస్ ఒక ముస్లింకు టికెటిచ్చిందని సూత్రీకరణ చేస్తుంఢ్రు. ఒకవేళ ముస్లింకు గాకుండా మరెవ్వరికైనా టికెటిచ్చిఉంటే టికెట్ అమ్ముకుండని ఈజీగా బట్టగాల్చి మీదేశెటోళ్లు. కేసీఆర్‌ని సమర్థించడం కాదుగానీ మహబూబ్‌నగర్‌లో ఇబ్రహీం ఓడిన తర్వాత మీడియాకెక్కి రొద పెడుతున్న మేధావులు ఎన్నికల సమయంలో పార్టీల కతీతంగా 'ఇబ్రహీం'ని ఒక ముస్లింగా, తెలంగాణ వాదానికి ముస్లింల మద్దతు మరింతగా పెరగాలంటే ఆయన గెలవాల్సిన అవసరం ఉందని ఎక్కడైనా చెప్పింఢ్రా? ఎన్నికల్లో ఎన్నడైనా ప్రచారం చేసింఢ్రా? ఇవేవి చేయకుండా అవాకులు చెవాకులు రాయడం, మాట్లాడ్డం వాళ్ల జ్ఞానంలోని ఖాళీలకు సూచనలు. ఇంకొందరు మతతత్వ బీజేపి గెలిచినా ఫరవాలేదు గానీ, టీఆరెస్, దాని అభ్యర్థి గెలువకూడదని అన్ని విధాల ప్రయత్నం చేసిన వాండ్లలో కరుడుగట్టిన కేసీఆర్ వ్యతిరేకులు, 'ఫ్రంటు'గట్టిన 'లౌకిక వాదులు' ఉన్నారు. 'దండు'గట్టిన అవకాశవాదులూ ఉన్నరు. వీరందరూ ఈ రెండు పార్టీల్లో తెలంగాణకు ఏది ఎక్కువ నష్టం చేస్తుందో ఆత్మపరిశీలన చేసుకోవాలి. 2014 లోపల తెలంగాణ తెచ్చేందుకు గట్టిగ కొట్లాడకపోతే, ఆ తర్వాత ఏ సమయం ఎట్లుంటదో చెప్పలేం. ఎందుకంటే ఇప్పటికే తెలంగాణవాదులు నిద్రలోనూ, మెలుకువలోనూ ప్రత్యేక రాష్ట్రన్నే తలుస్తున్నరు. ఒక్కొక్క సారి తెలంగాణను కండ్లజూస్తమా? అని నిరాశ పడుతున్నరు. అన్ని పనులూ పక్కనపెట్టి దినాం శక్తికి మించిన తెలంగాణ భారాన్ని మోస్తున్న ఉద్యమకారులు ఎప్పుడెప్పుడు బరువు/బాధ్యతను దించుకుందామా? అని చూస్తుంఢ్రు. కచ్చితంగా 2014 వరకు ఈ భారాన్ని మోయలేమని తేల్చి చెబుతుంఢ్రు. 2014 తర్వాత 2019 వాదన రాదనే గ్యారంటీ కూడా ఏమీ లేదు. స్కైబాబ కూడా అన్నీ వదిలేసి తెలంగాణ కోసం తెగించి కొట్లాడుతుండు. సాహిత్య సమూహమై తిరుగుతుండు. మెదడుని నీళ్ళు నీళ్లు చేసుకొని ఆలోచిస్తుండు. అందుకే ఇగ ఆగేది లేదు అని హెచ్చరిస్తుండు. ఈ పార్లమెంట్ సెషన్‌లోనే తెలంగాణ ప్రకటించాలని డిమాండ్ చేస్తుండు.



వలసాధిపత్యంపై ధిక్కారం ప్రకటిస్తూ, మతతత్వ వాదుల గుండెలపై అక్షర శరాల్ని కవిత్వం-వ్యాస సంకలనమై నాటిండు స్కై. 'జక్మీ అవాజ్'తో తెలంగాణను గానం చేస్తుండు. 60 ఏండ్ల సంది ఏసి ఏసి అరిగిపోయిన పాత రికార్డునే 'నైజాం సర్కరోడా.." పేరిట మళ్ళీ మళ్లీ ప్లే చేస్తూ, 'రజాకార్ల పాలనం'టూ ముస్లింలను భూత, భవిష్యత్,వర్తమానాల్లోనూ ముద్దాయిలుగా నిలబెట్టే ప్రయత్నం చేస్తుంఢ్రు. లెఫ్ట్, రైట్ అనే తేడా లేకుండా అన్ని భావాజాలాల వాండ్లు ఇందుకు బాధ్యులు. కనీసం తెలంగాణా సందర్భంలోనైనా పాత గాయాల్ని కెలుకొద్దు అని విజ్ఞప్తి చేసినా విజ్ఞత లేకుండా వ్యవహరిస్తుంఢ్రు వీళ్లు. తెలంగాణ సాయుధ పోరాటం నాటి నుంచీ కమ్యూనిస్టులు రాసిందే చరిత్రగా చలామణి కావడంతో అసలు రజాకార్లు అంటే ఎవ్వరు? అనే విషయం కూడా తెలియకుండా బోయింది. రజాకార్లలో హిందువులు కూడా ఉండేవారనే విషయం కనీసం వాళ్ల ఊహకు కూడా అందదు. కొందరు ఇప్పటికీ 'నయా రజాకార్' అంటూ ముస్లింలను, వారికి మద్దతిచ్చే లౌకిక వాదుల్ని ఆడిపోసుకుంటుంఢ్రు. రజాకార్ అనే పదం వాడడం ద్వారా ఈనాటి ముస్లింలకు ఎలాంటి సంబంధం లేకున్నా వాళ్లని అవమానించే ఉద్దేశ్యంతోనే ఆ పదాన్ని వాడుతుంఢ్రు. ఇది ఇప్పటి జర్మనీ ప్రజలందరినీ నాజీలు అని పిలిస్తే ఎలా ఉంటుందో, ఎంత బాధపడతారో, ముస్లింలు కూడా రజాకార్ అనే పదం వాడకం ద్వారా అంతే బాధగా ఫీలవుతారనే విషయం అనుభవిస్తేగాని తెలియదు. మత రాజకీయాలు చేసే పార్టీలు ఎట్లాగు తమ స్వీయప్రయోజనాల కోసం ప్రత్యర్థి పార్టీలను, వారు అనుసరిస్తున్న మతాన్ని కేంద్రంగా చేసుకొని దాడికి దిగుతాయి. ఇట్లాంటి సందర్భంలో చరిత్రలోని విషయాలను వర్తమానానికి అన్వయిస్తూ ఏతా వాతా అప్పుడూ, ఇప్పుడూ ముస్లింలు 'ముద్దాయి'లే అన్న సూత్రీకరణ దగ్గర వచ్చి ఆగుతుంఢ్రు. తమకు సంబంధంలేని విషయాన్ని మాకెందుకు అంటగడుతుంఢ్రు అని న్యాయంగా హిందూత్వ వాదుల్ని నిలదీసిండు స్కైబాబ. రెడ్డి రాజులకు ఈనాటి రెడ్లకు సంబంధం లేనట్టే నిజాంకు సామాన్య ముస్లింలకు ఎలాంటి సంబంధం లేదని ఈ పుస్తకం ద్వారా నిద్ర నటిస్తున్న మతతత్వ వాదుల కండ్లు బైర్లు కమ్మేవిధంగా చెప్పిండు.

'గుల్‌సితాహ్' తెలంగాణకు వలసాంధ్రులు 1956లో ఆంధ్రప్రదేశ్

పేరిట అగ్గి పెట్టకముందే హైదరాబాద్‌ని భారతదేశంలో బలవంతంగా విలీనం చేసుకున్న నాడే ఇక్కడి భూమి పుత్రుల బతుకులు చిద్రమయ్యాయి. వందలు, వేలమంది ముస్లింలు అత్యాచారాలకు బలయ్యారు. హతమయ్యారు. ఉన్న ఉద్యోగాలు కోల్పోయ్యారు. మాటీ మాటికి రజాకార్లంటూ హేళనకు గురవుతున్నారు. నిజానికి మళ్లీ రజాకార్ల కాలం నాటి పరిస్థితులు రాకుండా ఉండాలంటే ఆంధ్రప్రదేశ్ సమైక్యంగా ఉండాలని కోరుకుంటున్న తెలంగాణ వాళ్లలో ముస్లింలే ఎక్కువ. చీటికి మాటికి రజాకార్లంటూ హేళన చేసే వారి కంటే ఆ ఊసే ఎత్తని వలసాంధ్ర దోపిడి దారునితో కలిసుండడం వల్ల నష్టమేమి లేదు అనే అభిప్రాయానికి ముస్లింలు, ముఖ్యంగా పాతనగరం ముస్లింలు వస్తే అది వారి తప్పుకాదు. అది తెలంగాణ ఉద్యమం తప్పు. విశాల దృక్పథం లేకుండా దాన్ని అగ్రభాగంలో ఉండి నడుపుతున్న నేతల తప్పు. ఇన్నేండ్ల తెలంగాణ ఉద్యమం ముస్లింలకు సమానమైన, గౌరవప్రదమైన జీవితం భవిష్యత్తెలంగాణలో ఉంటుందనే భరోసా ఇవ్వలేక పోయింది. వర్తమానంలోనే ముస్లింలకు దక్కాల్సిన న్యాయమైన వాటానే దక్కనప్పుడు భవిష్యత్తులో బాగుంటుందనేది భ్రమే. ఈ భ్రమల్ని తొలగించి భరోసా కల్పించేందుకు తెలంగాణవాదులకు మహబూబ్‌నగర్ ఉప ఎన్నిక మంచి అవకాశాన్ని కల్పించింది. కాని దాన్ని సరిగ్గా వినియోగించుకోలేక పోయాము. కనీసం బీజేపీ రజాకార్ల పాలన వస్తుంది. ఇది ఇండియా-పాకిస్తాన్ క్రికెట్ మ్యాచ్ అని రెచ్చగొట్టే ప్రసంగాలు చేసినప్పుడైనా అది సరైన పద్ధతి కాదు అని హైదరాబాద్‌లోని జేఏసీ నాయకులు మాట్లాడాల్సి ఉండే. అయినా వాళ్లు మౌనంగానే ఉన్నారు. ఈ మౌనం బీజేపీ గెలుపుకు తోడ్పడింది. ఇది వ్యూహాత్మకమా? ఉద్దేశ్య పూర్వకమా అనేది తేలాలి. అంతేకాదు సంగారెడ్డి, హైదరాబాద్‌లలో మతతత్వ పార్టీలు తమ తమ ప్రాబల్యం పెంచుకోవడానికి, ఘర్షణలు పెచ్చరిల్లడానికి కూడా ఈ మౌనం, ఈ గెలుపూ అవకాశం కల్పించింది. ఇదే మౌనం హైదరాబాద్ మత ఘర్షణకు మెజారిటీ మతానికి చెందిన వాళ్లే కారణమని తెలిసినప్పుడు కూడా కొనసాగింది. ఇప్పటికైనా వీళ్లు మౌన వ్రతం వీడాలి.

హైదరాబాద్ పాత బస్తీలో సిసి కెమెరాలు పెట్టి నిఘాను కట్టుదిట్టం చేస్తామని చిదంబరం కౌంటర్ టెర్రరిజమ్‌పై జరిగిన జాతీయ సమావేశంలో ప్రకటించిండు. పాతబస్తీలోనే ఎందుకు? అసలు ప్రజల్ని దొంగలుగా,



టెర్రరిస్టులుగా చూసే నిఘాకెమెరాలు ఎందుకు? అని ఎవ్వరూ అడగలేదు. పట్టించుకోవాల్సిన విషయాల్ని గాలికొదిలేసిండ్రు. అంతేగాదు ముస్లింలు తమ ప్రతీకలుగా భావించే వాటిని పాలకులు క్రమ క్రమంగా కనుమరుగు చేస్తుండ్రు. అవుకాఫ్ భూముల్ని మింగి మంచినీళ్లు తాగిండ్రు. నిజాం రాజైన, సామాన్య పౌరుడైనా ఒకే తీరు వైద్యాన్ని అందించిన ఉస్మానియా హాస్పిటల్‌కు ఇప్పుడు సుస్తీ చేసింది. అదే నిజామ్ తన సొంత డబ్బుతోటి కట్టించిన నిమ్స్ దవఖానల ఇవ్వాళ సామాన్యుడు పొయ్యి చికిత్స చేయించుకునే పరిస్థితి లేదు. ఇవన్నీ కలగలిసి తమ సంస్కృతి కనుమరుగయ్యి, భాష మాయమై, బతుకు ఆగమై, తమని చరిత్ర హీనులుగా లేదంటే హీన చరిత్రులుగా చిత్రిస్తుంటే గుండె కలుక్కుమన్నప్పుడల్ల రక్తంగక్కుకున్న అక్షరాలే ఈ కవిత్వం-వ్యాసాలు.

ఆర్తి, స్పందించే మానవీయ గుణం ఉంటే గానీ కళ్లల్లో చెమ్మ ఉండదు. కాని స్కైని కదిలిస్తే చాలు కాళోజి లాగా కంట నీరొలుకుతుంది. ఇంత మెత్తటి గుండె ఉన్న స్కై కత్తుల గురించి రాసిండు. ట్రెయిటర్స్ కవితలో "...సిగ్గూశరం ఉన్నోళ్ళయితే/ ఇన్నాళ్లూ రాసిన ఆ కలంతోనే పొడుచుకోండి/ అట్లన్నా కవిత్వం పునీతమవుతుంది" అని స్పందించే హృదయంలేని వలసాంధ్ర కవుల్ని హెచ్చరించిండు. ఇంగ్లీషోల్ల సోపతితోటి అలవాటైన దోపిడి విద్యను తెలంగాణ మీద అమలు జేసిండ్రని 'బద్వా' కవితలో జెప్పిండు. తనదైన ముద్రతో చాంద్తారల్ని అక్షరాల్తో కాగితంపైకి దింపి "పట్నమొచ్చి శానా ఏళ్ళయింది/ నెలపొడుపును ఊళ్ళె ఒదిలి... చాన్నాళ్ళకు కలిసిన దోస్తుకు అలైబలై ఇవ్వబోతి/ త్రిశూలం గుచ్చుకుంది" ఇంత చిన్న లైన్‌లో పెద్ద ఫిలాసఫీ చెప్పడం తెలుగుభాషలో అసాధ్యం. కాని స్కై సాధ్య చేసిండు. ఉర్దూలో అయితే ఒక్క చిన్న పదంతోటి పెద్ద విషయాన్ని ఈజీగా చెప్పొచ్చు. బహుశా ఉర్దూతోటి ఉన్న అనుబంధమే చాంద్తారాల్ని రాయించింది కాబోలు.

ఒక అంశానికుండే వంద పార్శ్వాలను తడిమి తడిమి తనివితీర కవిత్వమల్లడం 'రోడ్డు ఉద్యమం అడ్డా' 'ఐ'లో కనబడ్తది. తాను చెప్పాలనుకున్నది కవిత్వం, వ్యాసాలు, కవిత్వం ద్వారా ముక్కుసూటిగా పక్కోడేమనుకుంటడు అనే పట్టింపు లేకుండా చెప్పిండు. తాను నమ్మింది ఎవ్వరేమనుకున్నా కుండబద్దలు కొట్టినట్టు చెప్పడం స్కైకి అబ్బిన విద్య.

కథల్ని రాష్ట్రేతర ప్రాంతాల్లో కూడా ఊరేగిస్తూ, సాహిత్యోద్యమకారుడిగా విరామమెరుగక పనిచేస్తూ ఇప్పుడు 'జక్మీ అవాజ్'తో తెలంగాణను కదిలిస్తుండు స్కై. ఒడ్డూ పొడుగులో తనకు మించిన భారమైనప్పటికీ ఉద్యమావసరాల రీత్యా భారాల్ని మోస్తూ, తన తోటి మిత్రుల్ని కూడా ఉరుకులు, పరుగులు పెట్టించి ముందుకు నడిపించడం స్కైకి బాగా తెలిసిన విద్య. ఆకాశంలో (స్కై)లో చాంద్‌తారల్ని ఒడిసి పట్టి మన చెక్కిలిపై రాపాడించడమే కాదు, మండే సూర్యుడై వలసాంధ్ర ద్రోహులపై, యేం ఎండకాగొడుగు పట్టే అవకాశవాదులపై అగ్గి వర్షం కురిపించాడు. వయసుతో పాటుగా ఈ సెల్సియస్ ఇలాగే కొనసాగాలని కోరుకుంటూ....

-సంగిశెట్టి శ్రీనివాస్
తారీఖ్: 18-04-2012



# షాయరీ

కవిత్వం
పొందిచ్చిన వాక్యాల విచ్ఛిత్తి
పేర్చిన పదాల మధ్య అలజడి
ఎగిసే అక్షరాల ఆందోళన
కవిత్వం-ఉద్యమం పర్యాయపదాలు

కవిత్వం- జొన్నరొట్టెల రుచి
నోట్లో ఊరే పచ్చి చేపల పులుసు
బీద బతుకుల ఆసరా
అంబలి-సంగటి-గట్క
జీవి గుంజే హైదరాబాదీ బిర్యానీ

కవిత్వం- బోనం ఎత్తుకున్నది
బోనం మట్కీల మధ్య శిగమూగుతున్నది
రంగుల్‌రంగుల పూలన్నిట్నీ ఒక్కటి చేసి
బతుకమ్మ ఆడుతున్నది
అస్సోయ్‌దూలా పాడుతూ
నిప్పుల గుండం తొక్కుతున్నది
రోడ్డుమీదే సహపంక్తి భోజనమయ్యింది

కవిత్వం- గోడమీది నిలువెత్తు కచ్చా స్లోగన్
దండుబాట మీద సబ్బండ జాతుల కోలాటం
వాగ్గేయకారుడి నాలుక చివరి వాయువేగం
కణకణ మంగే డప్పు సూర్యుడి మీద
            చిందేసే చిర్రా చిటికెన పుల్ల
ఉద్యమకారుడి కంటి ఎరుపు- లేచిన పిడికిలి

జవాన్ల కరకట్టల్ని ఛేదించే జనప్రళయం
ఉద్యమ ఉత్ప్రేరకమైన చదువుల బడి
ఎగుస్తున్న విద్యార్థులే జెండాల
కాలబడుతున్న ఒంటిలోంచి
సానబట్టిన కత్తిలా దూసుకొస్తున్న నినాదం
మనసున్న కన్నులోంచి దూకుతున్న అశ్రుకణం
అవును
కవిత్వం ఇవాళ తెలంగాణ

*2010, 'వివిధ' ఆంధ్రజ్యోతి*



# రోడ్డు ఉద్యమం అడ్డా

నేను మళ్లీ రోడ్డు మీది కొచ్చాను
భగాయించి నువ్వు ఇంట్లో నక్కినవ్
రోడ్డు ఇవాళ నినాదమైంది
రోడ్డు ఇవాళ ర్యాలీ ఐంది
రోడ్డు ఇవాళ రాస్తారోకో ఐంది
రోడ్డు ఇవాళ బంద్ కి ప్రతిరూపమైంది
రోడ్డు అసెంబ్లీ ముట్టడికి దారి చూపింది
రోడ్డు ఇవాళ నన్ను పొదువుకొని
నీపై రాళ్లు విసిరికొట్టింది
నీ బహుఅందమైన కలల్ని
భళ్లున బద్దలు కొట్టింది
నేను ఒక్క పిలుపునిస్తే
నువ్వు ఎక్కడికక్కడ జామ్
నేను నినదిస్తే
నీ గుండెలు పిక్కటిల్లాయ్
నేను మళ్లీ రోడ్డుమీదికొచ్చాను

గ్రహించావా
నీ మదిలో కట్టుకున్న గోడే
నువ్వు నా ప్రాంతానికి రాకుండా
రోడ్డుమీద అడ్డుగోడై లేచింది

నా నాడీమండలం రోడ్డు
ప్రవహిస్తున్న ఉడుకు నెత్తురు నేను
రోడ్డు నా పూర్వీకులు తొలిచిన తొవ్వ
రోడ్డుమీదికి నడవకుంటె రక్తచలనముండదు నాకు
గుమిగూడందే గుంపులో కలవందే దినం గడవదు నాకు
రోడ్డు నా అడ్డా

రోడ్డు మీద పుట్టినోళ్లల్లోంచే
ఉద్యమకారుడు ఉద్భవిస్తాడు
రోడ్డు మీద తిరిగినవాళ్లల్లోనే
ఉద్యమకారుడు ఉరకలేస్తాడు
రోడ్డు మీద బైఠాయించిన వాడి నుంచే
ఉద్యమ రక్తం చింది పడుతుంది
రాతిముక్కను ఆయుధం చేయడం తెలుసా నీకు
ఉద్యమకారుడికి తెలుసు
రోడ్డుని ఉద్యమానికి వేదిక చేయడం తెలుసా నీకు



ఉద్యమకారుడికి తెలుసు
రోడ్డు మీదికొచ్చిన ఉద్యమకారుడు ఒక్కడే
ఒక్కొక్కడే- వందలు వేలు లక్షలవుతాడు
నీకు చేతనవుతుందా ?
రోడ్డు మీద నడిచినవాడివే కదా
రోడ్డుని అవమానిస్తావా ?
రోడ్డు నా అమ్మరా !
రోజూ పలకరిస్తుంది నన్ను
నా ఎతలన్నీ తెలుసు దానికి
నా నిరసనకి ఇంత చోటు నిచ్చింది
నా ఆందోళనలన్నింటికీ ప్రతిబింబమైంది
ఉద్యమానికి అద్దమైంది
ఉద్యమించడం చేతకానివాడా!

మాకు ఉద్బోధలు చేస్తావా?
రారా! నీకూ నాలుగు నినాదాలు నేర్పిస్తా
నా రక్తంలో సోడా కలుపుకొని తాగి జోగుతున్నవాడా!
మత్తు దిగి తెరుచుకున్న నీ కన్ను మీద
తెలంగాణ పటం ప్రతిబింబమవుతుంది
అందులో నా హైదరాబాద్
కోహినూరై మెరుస్తుంది

*(కొందరు కోస్తాంధ్ర 'కవుల' తెలంగాణ వ్యతిరేకతను నిరసిస్తూ..)*

*ఫిబ్రవరి 2010'జాగో..జగావో' తెలంగాణ ఉద్యమ కవిత్వం నుంచి*

# బద్వా

"అయ్యో - నాబిడ్డలు
ఒకని జోలికి బోతోల్లు గాదు
ఒగని ఉసురు బోసుకుంటోల్లు గాదు
ఒగల ఉప్పు దింటోల్లు గాదు
ఉన్నదున్నట్లు మాట్లాడ్తె
నీతి దప్పుతున్నవంటె
నా బిడ్డల్ని పొట్టన బెట్టుకుంటున్నవ్ గదర
గరీబోల్ల కోసం బందూఖ్ బట్టినోన్ని సంపుతుంటివి
నీ లెక్కనె మనుషులందర్కి హక్కులుంటయంటె నరుకుతుంటివి
తుర్కోల్ల వప్పి పోరగాల్లని పరాయి ఏజంట్లని పట్కపోతుంటివి
ఏ దేశంర నీది
మా కాడ పెద్దిర్కం జేస్కుంట
మమ్మల్నే ఆగమాగం జేస్తున్నవ్ గదర
అన్నం బెడ్తున్నోన్కి పురుగుల మందు తాపియ్యబడ్తివి
పత్తిచెట్లను ఉరికొయ్యలు జేస్తివి
కంపెనీల బతుకుదెరువుల్ని మూతబడేస్తుంటివి
నువ్వు సత్తెనాశనం గాను



నువ్వు పురుగులు బడిపోను
నీ ఏశాలు అరవపోల్లకాడ సాగయని
మా తాన ఆడుతున్నవార ?
సోపతిల తెల్లోని బుద్దులు ఒంటబట్టి
అచ్చం ఆని లెక్కనె మా మీద రాజ్యం జేస్కుంట
నా బిడ్డల కడుపు గొట్టి
నీవోళ్ల బొజ్జలు నింపుతున్నవారీ
మేం ఆ అంగ్రేజోన్ని సూళ్లే
నిన్ను జూస్తున్నం

మా కోహినూర్ ఎవని కిరీటంలనో మెరిసినట్టు
మా పచ్చదనం దగదగల్ని తరలిస్తిరి గదర
మా గొలుసుకట్టు చెరువులెయ్యి
కుంటల్ల చెరువుల్ల బావుల్ల తానాలాడిన
మా సంతసాన్ని మాయం జేస్తిరి గదర
కండ్ల మీద ఆనకట్ట లేసి చూపానకుంట జేసి
కండ్ల కింద పంటలు పండించుకుంటున్నరారీ
ఈ ఒంటిని 'జలాశయం' చేసుకుంటిరి
దాన్యాగారం చేసుకుంటిరి
'డబ్బు' సంచి జేసుకుంటిరారీ

ఈ తావు ఉజ్జెమాల పుట్ట
పాముల్లెక్క జేరితిరి గదర
తురక రాజులుగుడ ఈడ రాజ్జెం జేసిన్రు గని
మా రాజులు...
మా నోటికాడిది గుంజి ఇంకోనికైతె పెట్టలె
ఈడ రాజ్జెం జేసిన్రు
ఈ మట్టిల్నె గలిసిన్రు
ఆళ్లె నయమనిపిస్తున్రు
నా బిడ్డలను నీళ్లకు బువ్వకైతె సంపలె
సాచ్చెం రుజువుల్లేకుంట
నా బిడ్డల పాణాలైతె తోడలె
ఆళ్లను ఎలగొట్టి
మీరు శనిలెక్క పట్టుకున్రు గదరా..."

*జూన్ 2002 'ముల్కి', 'మత్తడి' తెలంగాణ కయిత*



# QABZA

ఊటగ ఉర్కుతున్న
గని ఉర్కొస్తలె
లాగు జేబుల్ల పెద్ద పెద్ద తాళాలు
బరువుకు కాళ్లు కదుల్తలెవ్
సుట్టు ఎనుగు పాత్తుండు
అరెరె! ఆళ్లు మునిగిపోతున్నరు
ఉర్కిపొయ్యి బచాయించాలె
ఉహూం ఊటగ ఉర్కొస్తలె
కాళ్లు బోదకాల్లలెక్క ఇంత లావెక్కిపోతున్నయ్
అడుగు కదుల్తలె
ఎట్ల
యాడికాడ కబ్జా పెడ్తుండు
ఎటు పోతెట్టు లేదు
నా ఓళ్ల చేతుల్ల ప్లకార్డులు
'జాగా ఎవన్ది – జాగీ రెవడు'
అగో, దండుబాటకు రేగ్గంప కొడ్తుండు
ఉంటాఉంటే ఇంకా కషాయమెక్కుతుండు
ఝట్‌న ఎనుగుకు పామై ఏలాడుకుంట కనబడ్తుండు
బండ్లబాటంత బుర్దబుర్ద

ఎండిపొయ్యి దడుసుకుంటట్టు
మనిషిపట్టేంత పెద్దగ నెర్రెలు ఇచ్చుకుంటున్నది
అగ్గొ కత్తుల్తోటి ఎంటబడ్తుండు
పిల్ల బాటల్నిండ ముండ్ల తీగెలు
చూస్తుండంగనె పెరిగొస్తున్నయ్
ఒక్కోపాలి బొల్లిగడ్డంతోటి కండ్లబడ్తుండు
మల్ల ఆదే ఒల్లంత కాషాయం పూస్కొని-
అంతల్నె విభూతి రాస్కొని ఎగుర్కుంట వస్తుండు
ఇంకోపాలి సుక్కల్‌సుక్కల జండాతోని
బూగోళానికంత ధమ్కి ఇచ్చుకుంట
యాడికాడికి ఎనుగు పాత్తుండు
బాటలన్ని మూసేస్తుండు
ఎట్ల
నా వోళ్లు మునిగిపోతున్నాలె
ఎట్లన్న ఉర్కాలె
కాళ్లు కదుల్త లెవ్వు
అయ్‌నా ఉర్కాలె
ఎటోదిక్కు ఎనుగుతొక్కి
కాలిబాటన్న ఎయ్యాలె

*-2000*



# అనాగరికుడు

మాటకు ముసుగులు తొడిగి
అందంగా ముస్తాబు చేసి విడిచేటోన్ని కాను

వొంకర నవ్వు వొంకర చూపు
నా ఒంటిని గీరి పోతుంటయ్
తేటని చల్లని నవ్వుతో చూపుతో
హాయినై తేలిపొయ్యేటోన్ని

పైపై పూతలు పడవు
అచ్చమైన రుచినిస్త- తీస్కుంట

మొఖంపై సహజమైన కళను
బిగి కౌగిలిని
నల్లని కొండను
నల్లని మబ్బును
నల్లని మనిషిని...
నలుపు నా అమ్మదేవత
అందుకు నేను అనాగరికుణ్ణి!

నిరసన నా పురిటికేక
నా పాయేది?

గుండెకు గుండెను కలిపే
అలాయిబలాయి తీసుకుంట
అందుకు నేను అనాగరికున్ని!

అగ్రకులపోనికి దళితుడు
మగవానికి ఆడామె
ఆంధ్రోనికి తెలంగానోడు
మెజారిటీకి మైనారిటీ మతంవాడు
పాశ్చాత్యునికి పశ్చిమాసియావాడు
అనాగరికుల్లెక్కనే కనబడ్డరు!

ఆళ్ళు చేసే పోరాటం
అనాగరికత లెక్కనే కనబడ్తుంది!

కంట్లో పొడిచి, కర్ర ఊతమందిస్తున్నట్లు
నటించడం నాగరికతంటె...
అణిగి బతకడమే,
ఆధిపత్యాన్ని ఆమోదించడమే నాగరికతంటె...
నేను అనాగరికతనె ఆహ్వానిస్త!!

*2001 'వార్త' దినపత్రిక*



# ఐ

'సర్వేంద్రియానాం ... ...'
అందమైన చిన్నప్పటి కన్ను పాఠం...
కన్ను బొమ్మ ఎంత ముద్దుగ గీసేటోన్నో
ఇప్పట్కి కళ్లల్ల తిరుగుతున్నది
చిన్నతనం పెన్సిల్ మల్లమల్ల దిద్దిన నెమలి కన్ను
కన్ను అంటె సాలు– అందమైన బొమ్మే మెదిలేది
పెద్దయినంక తెలిసొచ్చింది–
అందమైన కన్నుకు–మాకు శానా దూరమని..
అరెరే... తేరుకునే లోపల్నే
కాలం కన్ను సొన కారిపాయె

ఇప్పుడు కన్ను అంటె–
ఎంతకు నిద్దర పట్టక
జీవం లేనట్లు కదలాడే గరీబు ఖాజామియా..
పంక్చర్లు అతికే ఉస్మాన్ భాయ్ ఢీలాపడ్డ చూపు..
మా అమ్మీ కంటి కింద నల్లగా– పగిలిన రేగడి..
ఊర్లె శానా ముస్లిం ఇండ్లల్ల షాదీ కాని చెల్లెల్లా–
అబ్బాజాన్ పక్షవాతపు రెప్పల మధ్య అడ్డంగా..
కండ్లద్దాలు మసకబారి కుట్టుమిషిన్ సూదిలో
దారం ఎక్కని నానీమా తనుకులాట..

ఇయాల కన్ను అంటె-
కొడుకు గూడలు పట్టుకొని లేవాల్సింది పోయి
చీకటి పడితే గోడలు పట్టుకొని నడిచే మాదిగ ఎంకయ్య తాత..
ఎద్దు కొమ్ము విదిలిస్తే
కారిపోయిన నాగయ్య మామ కొడుకు ఒంటరి చూపు..
పగిలిన ఒంటి కన్ను అద్దంతో
కనాకష్టాలు పడే పెరిక లచ్చువమ్మ..
చిన్నతనంలో కొడుకుని తడిమి తడిమి చూసుకున్న యాదిల
వాడు తప్పిపోయిన పట్నం బాటకు అతుక్కొని
చితికిపోయిన ఈదయ్య కక్కయ్య..

అయ్యో.. తల్చుకుంటే ఊరంతా పరేశాన్లతోని
కళ్లన్నీ గుంతలు పడి చూపానకుంటయ్యో
కన్ను ఇప్పుడు అందమైన బొమ్మ కాదురా తమ్మీ
అగాధపు లోతుల్ని చూపే గుంత..
మా ఊరే ఇప్పుడు
కన్ను ఊడబెరికిన ఖాళీ బొయ్యారం !

*షాయర్, పొయిట్రీ బులెటిన్, డిసెంబర్ 2006*



# తెలంగాణ చాంద్‌తార

ఒక రేక కల్లు పట్టిచ్చిన
సూరీడు తెల్ల మొఖమేసిండు

●

పట్నమొచ్చి శానా ఏళ్ళయ్యింది
నెల పొడుపును ఊళ్లె వొదిలి

●

అమ్మీని పట్నం తెద్దామనుకున్న
'కియ్యాం కయ్యా'మన్న కోడి-పిల్లలు

●

అలుగు దునుకుతుంటే
పరక చాపల్దీ మాదీ ఒకటే సందడి

●

పోటీ పడేది బుడుబుంగ పిట్టా నేనూ
ఇప్పుడు నీళ్ళతోపాటు అన్నీ మాయం

●

చేపల పులుసు తలపుకొస్తె
ఎండిన చెరువుల నీళ్ళు నోట్లె ఊరబట్టె

ఎండిన ఏటిపక్క రైతు
ఎదురుచూపులో చూపు పొయింది

•

గూడు కట్టిద్దామనుకున్నానామెకు
పొడి ఇసుక ఎక్కిరించింది

•

ఒడ్డున నడుస్తున్నం
ఏటిలెక్కనె ఎన్ని అనుమానాలో భవిష్యత్తుమీద

•

దర్గా చుట్టూ జానయ్యలు, సైదమ్మలే..
బోసి నుదుళ్ళ జాతర

•

చిన్నప్పుడు గీసుకున్న బొమ్మలన్నీ అలాగే..
ఒక్క నేను తప్ప

•

పసి మున్నా ప్రశ్న
రోజూ పస్తులేగా-మళ్ళీ ఈ రోజాలేంది అమ్మీ



ఉర్సులో రోల్డుగోల్డు హారం కొన్నది అమ్మీ
అబ్బా మొఖం చిన్నబోయింది

•

చిన్నప్పుడు మొహరంలోనే అలావా తొక్కేది
ఇప్పుడు అడుగడుగునా నిప్పులు

•

చాన్నాళ్లకు కల్సిన దోస్తుకు అలైబలై ఇవ్వబోతె
త్రిశూలం గుచ్చుకుంది

•

ర్యాడ్‌క్లిఫ్ రేఖలు గీసిన్రు
గుజరాత్ నిండా

•

ఉద్యమం చేయాల్సిన సమయం
ఉద్యోగం చేసుకుంటున్నావా భై

•

అడుగు ముందుకు వెయ్
దారి అదే విచ్చుకుంటుంది

*'చాంద్‌తారా' నుంచి, ఏప్రిల్, 2009*

# ట్రైటర్స్

నువ్వూ నేనూ కలిసే
భూమి కోసం పోరాడుతున్న
వీరుల కోసం విప్లవగానం చేశాం-
నువ్వూ నేనూ కలిసే
కశ్మీర్, పాలస్తీనా, ఇరాక్
పోరాటాలను సమర్థించాం..
ఉద్యమ ఆవేశాల్తో ఊగిపొయ్యేవాళ్లం-
ఒకానొక సమయం ఇలా వచ్చింది

ముక్క దగ్గరా మగువ దగ్గరా
మనిషి మనస్తత్వం తెలుస్తుందంటారు..
నువ్వు ఆక్రమించిన నా నేల
ఉద్యమించేసరికి నీ నైజమూ బైటపడిపోయింది!

1

ఏకైక రక్తసంబంధాన్ని
ఏడేడు సముద్రాలు దాటనిచ్చినవాడా!
అమ్మగల్లాడిన మా మట్టిమీది ప్రేమను
అపహాస్యం చేస్తున్నావా?
మెత్తని నీ మాటకు మురిసిపోయేవాణ్ణి



అది చాకూ అని తేలి విస్తుపోతున్నాను
నీ ఆలింగనంలో గుండెలు విచ్చుకునేవి
ఇప్పుడు బ్రహ్మజెముళ్లు గుచ్చుకుంటున్నాయి

2

ఈ నేలే నన్ను కవిని చేసిందంటావ్
ఇవాళ ఈ నేలే తన విముక్తికోసం పెనుగులాడుతుంటే
ట్రైటర్స్‌లో ఒకడివయ్యావ్
కుడి ఎడమల తలలూపేవాళ్ళే
ఎవడి ముందు వాడి పద్యం పాడతావ్
తడబడుతున్న నీ పదమే
నీ కలాన్ని నిలదీస్తుంది

3

ఏ నేల నిన్ను తన జవసత్వాల నిచ్చి
పెంచి పెద్ద చేసిందో
ఆ నేలనే తన్నేసి
పరాయి దేశం ఎగిరిపోగలిగిన గద్దా..
నీకు మా మాతృప్రేమ తండ్లాట
ఎలా సమజైతది?

4

ఒక అస్తిత్వం గురించి మాట్లాడుతూనే
మరొక అస్తిత్వాన్ని కాదనడం ఏమనిపించుకుంటుంది?

మైనారిటీ అస్తిత్వ దీర్ఘ కావ్యమైనవాడా..!
స్త్రీవాదపు రెమ్మలై రెపరెపలాడినవారలారా..!
సోదర అస్తిత్వాని కొచ్చేసరికి
ఇంగితం ఆవిరైపోయిందా..
కపాలం డొల్లగా మారిందా..?

•

కవి అన్న వారికి కన్నెలా మలుగుతుంది..
ఆమ్ ఆద్మీ రోడ్ల మీదికొచ్చి నినదిస్తుంటే
రక్తం ఉరకలెత్తకుండా ఎలా ఉంటుంది..
ఇన్నాళ్లూ విప్లవాల వేషాలేసీ
ఉద్యమాల శిగాలూగీ
ఇవాళ ముడుచుకుపోయారేం..
మిమ్మల్ని ఇన్నాళ్లూ గౌరవించినందుకు
మాకే తలవంపులుగా ఉంది–
సిగ్గూ శరం ఉన్నోళ్లయితే
ఇన్నాళ్లూ రాసిన ఆ కలంతోనే పొడుచుకోండి
అట్లన్నా కవిత్వం పునీతమవుతుంది!

*01.09.2010*

htpp://skybaaba.blogspot.com నుంచి



# పంచీరే.. పంచీ!

పక్షి
స్వేచ్ఛను కోరుకుంటున్నది
స్వేచ్ఛ తన హక్కు అని తెలపడానికి
రెక్కలు కొట్టుకుంటున్నది
రెక్కలకు ఊచలు తగులుతున్నయ్..
పంజరం ఊచలు
అడ్డం పడుతున్నయ్
కెవ్వన అరుస్తున్నది పక్షి
లోకానికి ఆ అరుపు
'జై తెలంగాణ' అని వినబడుతున్నది

పక్షి
కొమ్మల్నీ.. పువ్వుల్నీ.. పచ్చికనూ.. ప్రేమిస్తుంది
ఊచలను కాదు

తమను పట్టుకొనే ఊచల్లాంటి
వేళ్లను కాదు
వేళ్ల లాంటి
లాఠీలను తుపాకులను కాదు
పక్షి పక్షితనాన్ని ప్రేమిస్తుంది
తమను బంధించే మనిషితనాన్ని కాదు

పక్షుల్ని మారణాయుధాలు ఆపలేవు
పక్షి అంటే ఎగరడం
ఎగరడం అంటే స్వేచ్ఛ
స్వేచ్ఛ అంటే ఆకాశం
ఆకాశాన్ని ఎవరు ఖబ్జా చేయగలరు?

వలసవాదీ!
జీవితంలో ఒక్కసారైనా ఒక పక్షిని
పంజరంలోని పక్షిని
ఆకాశంలోకి వదిలేసి చూడు...
మనసెంత సంతోషంతో గిరికీలు కొడుతుందో..!



# ఎవడు వాడు?

నా అమ్మగల్లాడిన భాషను
గొంతు దిగకుండా అడ్డుపడ్డదెవడు
ఓనమాలు దిద్దాల్సిన నా చేతుల్ని
ఎడమ నుంచి కుడికి మలిపిందెవడు
నా నాలుకను కత్తిరించి
పరాయి భాషను అతికిందెవడు?
హైదరాబాద్ తహెజీబ్ ని బర్బాద్ జేసిందెవడు?

ఇక్కడ ప్రాచ్య సంస్కృతి
అక్కడ పాశ్చాత్య సంస్కృతి
ఇక్కడ అలయ్‌బలయ్
అక్కడ అలగ్ సలగ్
ఇక్కడ దిల్‌దార్లు
అక్కడ ఖబ్జాదార్లు

కమ్మని రుచుల నా ఇరానీ కేఫ్ లెయ్?
గరీబుల ఆసరా దాల్‌ఖానా ఏది?
రాత్రిళ్లు పండించే ముషాయిరాలెయ్యి?
మనసులు ఉరకలేసే మతసామరస్యమేది?
ఎవడు సత్తెనాశనం చేసిండు కలుపుగోలుతనాన్ని?

# తల్లీ తెలంగాణా!

యాదన్న నిన్ను యాది మరువం
ఆఖరిసారి నువ్వు అమ్మను,
చెల్లెను సూడలేదని బాధపడితివి..
ఇయాల నీ త్యాగాన్ని
తెలంగాణ అమ్మలందరు
చెల్లెండ్లందరూ సూస్తున్నరే..

•

అమ్మా.. చంద్రమ్మా..!
నిన్ను ఎట్ల ఓదార్చనే తల్లీ..
హైదరాబాద్ నుంచి వచ్చి నీ చేతి బువ్వ తిని
నిశ్చింతగ పండుకొనే నీ బిడ్డ
ఇయాల నిన్ను పలకరించకుంటనే
బువ్వ తినకుంటనే శవమై పడివుంటే
ఎంత తల్లడిల్లిందో చంద్రమ్మ తల్లీ నీ మనసు
నీకు ఏం చెబితే నీ కన్నపేగు ఎత తీర్తదే..
నీ దుక్కం నీ ఒక్కదానిది కాదే తల్లీ..
తెలంగాణ తల్లులందరిదీ..
నువ్వు ఒక్క యాధన్న తల్లివి కాదే అమ్మా..!
నీ కియాల కోట్లాదిమంది బిడ్డలు..
నువ్వియాల మా తల్లులకి ప్రతిరూపం
నువ్వియాల తెలంగాణ తల్లికి ప్రతిరూపం
చేతులు సాచి నువ్వు ఏడుస్తుంటే
ఆ తెలంగాణ తల్లే ఏడుస్తున్నట్టుందే అమ్మా..!



# జంగుస్మానియా

ఉస్మానియా అంటే-
తెలంగాణతనం గుబాళించే వేలరేకుల పుష్పం
జడపదార్థాల్లోనూ జ్వలనం నింపే ఉత్ప్రేరకం

ఇక్కడ విద్యార్థులు కబుర్లు చెప్పరు
నిప్పుల్ని నెమరేస్తుంటారు
తోపుల్ని పేలుస్తుంటారు
వాళ్ళ ఉపన్యాసాలు ఆగని మెషిన్‌గన్లు
ఉస్మానియా అంటే-
ఉద్యమ హెచ్చరికల కేంద్రం

ఉస్మానియా అంటే-
తెల్లని కాగితాల్లా వచ్చిన విద్యార్థుల్ని
యుద్ధవీరులుగా మలిచే కర్మాగారం

ఇక్కడి గాలిలో నినాదాలు వీస్తుంటాయ్
ఈ నేల మీద పిడికిళ్ళు పూస్తుంటాయ్
ఉస్మానియా అంటే–
వేయి ఆలోచనల పూలు వికసించే చమన్

అవును–
ఇక్కడి వాయువులో ఎందరి శ్వాసలో
పోరు హోరు విన్పిస్తుంటాయ్
ఇక్కడి నేలమీద ఎందరి పాదముద్రలో
యుద్ధసాము నేర్పిస్తుంటాయ్
ఇక్కడ తిరుగాడిన వారిలో
విద్యుదయస్కాంత క్షేత్రాలు మేల్కొంటాయ్!
ఆర్ట్స్ కాలేజ్ చూడూ..
పొంచి ఉండే కొదమసింహం...!

*2011 'ఓ యు'ద్ధం నుంచి*



# దుఃఖనామా

పిడికిలెత్తీ పిడికిలెత్తీ నరాలు చిట్లిపోతున్నాయ్
నినదించీ నినదించీ గొంతులో రక్తస్రావమౌతున్నది
నా నెత్తురు చరిత్ర పేజీల నిండా అలుక్కు పోతున్నది
నా నుంచి మరో నాకు ఉద్యమం రాజుకుంటున్నది
నాన్చివేతలు కూల్చివేతలుగా పరావర్తనమవుతున్నా
ఎవడి బున్యాదులూ కదుల్తలేవ్..
నా ఎడతెగని దుఃఖం ఎవడి మనసుల్నీ చెమర్చడం లేదు

ఎక్కడా రక్తం మరకలు కానరావ్..
రక్తపాతం జరిగినట్టు దాఖలాలుండవ్
కత్తులు కనిపించవ్.. పిస్తోళ్లు మోగవ్.. బాంబులు పేలవ్
కాని.. కనిపించి వందలు
కనిపించక వేలు.. లక్షల నా హత్యలు..
నా పంచనామా నేనే చేసుకుంటున్నాను

ఈ బేచైనీ రక్త నాళాలు తెంచుతుంటే
నాలోకి నేనే ఉరితాడుకు వేలాడుతున్నాను
నిరసనగా నన్ను నేను తగలబెట్టుకుంటున్నాను

నా మరణ వాంగ్మూలాన్ని నేనే చదువుకుంటున్నాను
నా పాడెకు నేనే భుజం మార్చుకుంటున్నాను
నా శవ యాత్రలో నేనే ఉద్యమ పాటలై పొర్లుతున్నాను

ఒక చితి మంట ఆరకముందే
మరో చితిని అంటించుకుంటున్నాను
ఆ మంట వాడి బండ గుండెలో చిన్న పువ్వై పూస్తుందేమోనన్న
నా ఆశ వాడిపోతున్నది..

కాలుతున్న నా ఒంటి పొగ జీవవాయువై
గుక్క మలగని బయాన్ చేసుకుంటున్నాను
నా బూడిదను నా రక్తనదిలోకి రాల్చుకుంటున్నాను
నా అస్థికలను నా దుఃఖనదిలోనే కలుపుకుంటున్నాను

నా భూమిలో నన్ను నేను నిక్షిప్తం చేసుకుంటున్నాను
మట్టిలోకి ఇంకుతూ
ఈ నేల నాడీమండలమంతా వ్యాపిస్తున్నాను.....

*2011 'వివిధ' ఆంధ్రజ్యోతి*



# తల్వార్

ఆరీ.. వలసాంధ్రోడా!
తెలంగాణ వ్యతిరేకీ..!
పువ్వు-రాయి-బోనం-బతుకమ్మ
డప్పు-దరువు-ఆట-పాట
ప్రకృతి అంతా మీకు ఎదురుతిరిగిందిరా
ప్రకృతికి విరుద్ధంగా నిలిచిన మీ ఉనికిని
వేర్లతో సహా పెరికెయ్యడమే ఇక తరువాయి

మొహంపై పువ్వు
మనసులో ముల్లు
ఇంకా ఎన్నాళ్లు ఆడతాంర్రా నాటకం
ఇన్నాళ్లూ మేస్తిరి గదరా..
మనిషి ముసుగుల్లో ఉన్న పందికొక్కుల్లాగా
థ్థూ.. నీ యవ్వ
మొహంపై ఉమ్ముతున్నా ఇంకా వేలాడుదేంద్రా
సిగ్గూ శరం లేనోళ్లలాగా..
నీతి తప్పినోళ్లార్రా- నియ్యతి లేనోళ్లార్రా
నిప్పుల మీద నీళ్లు సల్లుదామని చూస్తున్నార్రా
ఇక్కడ నీళ్లే నిప్పై మండుతయ్ బిడ్డా
కన్నీళ్లే నిప్పు రవ్వలై లేస్తయ్

ఔ...
మా కణం కణం రాజుకుని
అణువణువూ నిప్పై ఎగుస్తున్నది
మా నేల తల్లి నేర్పిన ఓర్పే-
మమ్మల్నింకా ఆగబడ్తున్నది
ఓపికకూ హద్దుంటుంది బిడ్డా
ఇంకా మా ఓపికను పరీక్షించొద్దు
దేహాలు తల్వార్లై లేస్తయ్
నంగి నంగి వేషాలొద్దు
నక్క తెలువులు ఇంకా చూపెట్టొద్దు
కనలి కనలి అగ్నిగుండమై ఉన్నోళ్లం
రగిలి రగిలి రక్త కాసారమై మరుగుతున్నోళ్లం
ఇంకొక్క చాన్సిద్దామనే ఊకున్నం
లేదంటే- ఒంటితో మంటను రాజేస్తున్నోళ్లం కదా
కత్తిసాము చెయ్యడం కష్టమేం కాదు మాకు
దేహాన్ని చిటికెలో భస్మం చేస్తున్నవాళ్లం
అడ్డొస్తే అడ్డంగా నరకడం పెద్ద పనేం కాదు మాకు
గోస తీస్తున్నది మేము
తీర్పులు మీరు చెప్తార్రా!
మేడలు కట్టుకున్న మీ ఆధిపత్యం
మేము నినదిస్తే బీటలు వారుతుంది
మా శ్రమశక్తిని మా సంపదను దోచి
ఎన్ని అక్రమ నిర్మాణాలు చేసిర్నో
లెక్కలు తేలాలి బిడ్డా

బేవఖూఫుల్లారా! ఇంకా ఐక్యత గురించి మాట్లాడకుర్రా
మీరు మెక్కిన మా ఆస్తినంతా కక్కిస్తాం



మా నేల మీకు ఉమ్మడి ఆస్తి ఎట్లా అయ్యిందిరా
మీ ఇంటినో మీ ఇంటోన్నో
ఉమ్మడి ఆస్తి అంటే ఊరుకుంటార్రా
చాలు మీ నఖరాలు
తట్టా బుట్టా సర్దుకోవాలె
బెజవాడకు మెయిలు కడతం
బద్మాష్‌లంతా భగాయించాలె
మళ్లీ సూడొద్దు మా హైదరాబాద్ దిక్కు
మజాకైతున్నాద్రా..!
ఇజ్జత్ తక్కువ నా కొడకల్లారా..
ఊకుంటుంటే ఉపాయాలెక్కువ జేస్తున్నరేంరా
బొక్కలిరగ తంతమ్-
ఉచ్చ పడాలె బిడ్డా
అష్టదిగ్బంధనం చేస్తాం
ఎటూ పారిపోలేరు-
పాతరేస్తం కొడకా!

ఇదే మా ఆఖరి పోరాటం
ఈ మోఖా తప్పించిర్రో
మా ఓపికల బంధనాలు విప్పుతాం
నాలుకలు చీల్చడం కాదు
అవసరమైతే అడ్డొచ్చే దుర్మార్గుల్ని
పచ్చిచేపల్ని చీల్చినట్లు చీలుస్తాం
ప్రజాస్వామ్యం మా నమ్మకాన్ని కూలదోస్తే
మేము దాన్నే కూలదోస్తాం
ఖబర్దార్!

'సింగిడి', 'క్విట్ తెలంగాణ'

# 'ధ్వంస రచన'

ప్రజా సౌధాన్ని కట్టాలనుకునేవాడే
రాజ సౌధాలను కూలుస్తాడు
కోటను కూల్చకుండా
కొత్త రాజ్యాన్ని ఎలా నిర్మిస్తాం?
గడీని మట్టు పెట్టకుండా
వడిగా ఎలా ముందుకెళ్తాం?
కట్టాలంటే ముందు కూల్చాల్సిందే
అది విగ్రహమో.. నిగ్రహమో..
సౌధమో.. ఆయుధమో.. ఆయువో!
కళ్ళకు రూపమివ్వాలంటే
అక్కడ ఖాళీ ఏర్పర్చాలి ముందు
శిథిలాల గుట్టలు పేరుకొనేది కొన్నాళ్లే
వినిర్మించేవాడికి
శిథిలాలపై ప్రేమెందుకు
శిథిల మనసుల్ని
మనుషుల్ని ప్రేమించలేడు వాడు
దూసుకెళ్లే స్వభావమది
దూసిన ఖడ్గం వాడు..
దూసుకెళ్లే బాణం..
ఎత్తిన గడ్డపార!



గమ్యం తప్పు
ఏదీ కంటపడని గురి
పక్షి కన్ను తప్పు
చెత్తా చెదారమేదీ కనిపించదు
నిప్పును రాజెయ్యడమే తప్పు
నినాదమే.. నిర్మాణమే తప్పు
నాన్చివేతల్ జాన్తానై

వినిర్మాణానికి
ఏదో ఒక మూల నుంచి కూల్చడం మొదలవ్వాల్సిందే
గడ్డపార వెయ్యకుండా
మొక్కెలా నాటగలం?
పునాది తియ్యకుండా దేన్నైనా ఎలా కడతాం?
ఎవరినీ నొప్పించకుండా
సత్యమెలా చెబుతాం?
అవును
ఇవాళ కూల్చింది
రేపటి రూపును ఆవిష్కరించడానికే
జీవాలు కూలుతున్న ఆక్రందనే
విగ్రహాలు కూల్చింది
ఇంకొకటి చెప్పనా!
మా మధ్య
కొన్ని దుష్ట విగ్రహాలు తిరుగుతున్నాయ్
వాటిని కూడా కూల్చేదాకా చూడొద్దు!

* 'దిమ్మిస' వినిర్మాణ కవితా సంకలనం నుంచి

# నాలో పులులూ సింహాలు

నా ఒంటి మీది
జీవావరణ్యం ఖబ్జాకు గురయ్యింది
నోటి కాడి కూడు
గూడు తోడు దూరమై...
నాలో గర్జిస్తున్న
పులుల్నీ సింహాల్ని
కట్టి పెట్టాను
బుసలు కొడుతున్న
కోడెనాగుల్ని పట్టి పెట్టాను

పక్షులు ఆక్రోశంతో అరుస్తున్నాయ్
జింకలు లేళ్లు సైతం
పోరుకు సిద్ధమైనయ్

ఇక
నా ఒంటి నరాలు ఓపలేకపోతున్నయ్
కట్లు తెంచుకుని ఈ జీవజాలమంతా
మీద పడితే
ఖబ్జాకోరులారా!
ఫరారవుతరు బిడ్డా
ఖబర్దార్ !

*డిసెంబర్, 2010, 'క్విట్ తెలంగాణ'*



# లొంగని వీరుడికి సలాం

ఒక్కో భూమ్మీద
ఒక్కో పేరుతో పుట్టుకొస్తుంటాడు
లొంగనితనం వీరుడి మాతృక

తన నేలను ఖబ్జా చేస్తూ
తన నాలుకనే తెగ్గోస్తున్న వాడికి
చివరి శ్వాస దాకా లొంగనితనం
వీరుడి పోరాట రూపమే..

నీళ్లను కొల్లగొట్టి
ఆకుపచ్చదనాన్ని కొల్లగొట్టి
బీళ్లు చెయ్యజూస్తుండు శత్రువు
పెట్రోలును కొల్లగొట్టి
సకల జీవత్వాన్ని కొల్లగొట్టి
ఎడారులే చెయ్యజూస్తున్నడు శత్రువు
వీరుడన్నవాడు సై అంటాడా
వీరుడన్నవాడు ఖామోష్‌గుంటాడా
ఖబర్దార్ అంటూ గుండెల్లోంచి కేక వేస్తాడు
భూమి తల్లి కోసం బలిదానమవుతాడు

ఇరాకీ పిల్లవాడి తెగిన కలల రెక్కలు చూసి
చలించకుండా ఎవడుండగలడు?
వేల ఒక జాతి జనాన్ని
సమాధి చేయడం చూసి
రగలకుండా ఎవడుండగలడు?
ప్రపంచపటంమీద ఒక జాతి వతన్‌నే
మాయం చేయాలనే కుట్రను చూసి
ఎవడు భరించగలడు?
రేపు మరొక దేశం
ఖబ్రస్తాన్ అవబోతుండడం చూసి ఊకుండగలడా?
చుట్టూరా చేతులు కట్టుకొని చూస్తున్న లోకం
ఘడియకో మాట మార్చే లోకం
సిగ్గూ శరం లేకుండా సాష్టాంగపడే లోకం
లొంగని వీరుడి ముందు బలాదూర్
వీరుడెప్పుడూ నిజం మీదే నిలబడతాడు
వెన్నెముకే ఆయుధంగా కలబడతాడు
శాంతి కోసమే ఆయుధం పడతాడు
ఓడిపోవచ్చు
కాని లొంగిపోడు
ఒక్కో భూమ్మీద ఒక్కో పేరుతో పుట్టుకొస్తుంటాడు
లొంగనితనం వీరుడి చిరునామా



వీరుడు బరిసెనో బాణాన్నో పట్టినప్పుడు
తెల్లోడు బందుఖుతో వచ్చాడు
వీరుడు బందూఖు పట్టినప్పుడు
తెల్లోడు బాంబు లేశాడు
వీరుడు బాంబు లేద్దామంటే
తెల్లోడు మిస్సైల్లు ప్రయోగిస్తున్నాడు
శత్రువు గెలవొచ్చు
జనంలో వీరుడే నిలుస్తాడు
ఒక్కో భూమ్మీద ఒక్కో పేరుతో పుట్టుకొస్తుంటాడు
లొంగి బతకడం వీరుడి నైజం కాదు

రాళ్లను పగులగొట్టే వాళ్లల్లోంచి
ఇనుమును కరగదీసే వాళ్లల్లోంచి
నీళ్లను మండించే వాళ్లల్లోంచి
ఒక్కో వీరుడు పుట్టుకొస్తూనే ఉంటాడు
ఒక్కో చోట ఒక్కో పోరాట రూపం తీసుకుంటాడు
శత్రువు బలవంతుడే కావచ్చు
జిత్తులమారోడే కావచ్చు
నిజం వీరుడి చేతిలోనే ఆయుధంగా నిలుస్తుంది

నిజం వీరుడి చేతిలోనే ఆయుధమై మెరుస్తుంది
చివరి మాట దాకా
నిజమే వీరుడి నోట పలుకుతుంది
'సామ్రాజ్యవాదం డౌన్ డౌన్ ! అమెరికా డౌన్ డౌన్ !!'

జడ పదార్థాలకు
రాజుకునే గుణాన్నిచ్చే ఉత్ప్రేరకం
నిశ్చల నరాల్లోకి
వెచ్చని ఊపిర్లూదే ప్రాణవాయువు
లోకమంతా పాకుతున్న
లొంగిపొయ్యే వైరస్‌ను నిలువరించే రెసిస్టెన్స్
ఒక్కో భూమ్మీద
ఒక్కో పేరుతో పుట్టుకొస్తుంటాడు
ఉరకలెత్తే ఉడుకురక్తాల ఆత్మల్లోకి ప్రవేశిస్తుంటాడు

ఇజ్రాయెల్ యుద్ధట్యాంకుపై రాయి విసిరే బాలుడో
తెల్ల రక్కసి మూక మధ్య పేలే మానవ బాంబో
స్వాతంత్ర్యాన్ని కోరే కాశ్మీరీ గొంతుకో
నిజమైన పౌరసత్వంకోసం నినదించే భారత ముస్లిమో
ఒక్కో భూమ్మీద ఒక్కో పేరుతో పుట్టుకొస్తుంటాడు
ఒక్కో చోట ఒక్కో రూపంలో ప్రతిఘటన



ఒక్కో స్థాయిలో పోరాటం
పోరాటం ఎక్కడైనా పోరాటమే కదా
దురాక్రమణ ఎవడు చేసినా దుర్మార్గమే కదా
వీరుడు పోరాడుతున్న భూమి
ఎకరమో.. రాష్ట్రమో.. దేశమో...
నాటి బందగీకి సలాం
నేటి తెలంగాణ పోరుబిడ్డకి సలాం
కాశ్మీరీ వీరుడికి సలాం
పాలస్తీనా చిరునవ్వు అరాఫత్‌కి సలాం
ఇరాకీ గర్జన సద్దాంకి సలాం
భూమి కోసం పోరాడుతున్న వీరుడికి సలాం !
మాతృభూమి కోసం పోరాడుతున్న వీరుడికి సలాం !

(నేటి తెలంగాణ ఉద్యమానికి...
ఉద్యమంలో అసువులు బాసినతెలంగాణ బిడ్డలకు...)

సద్దాం ఉరి సందర్భంలో 'వివిధ' ఆంధ్రజ్యోతి

# ధిక్కారమే
# తెలంగాణ ముస్లింవాద సాహిత్యం

*కిసీ ఖౌమ్‌కో బర్‌బాద్ కర్నా హై తో*
*పహ్‌లె ఉస్‌కీ జబాన్ ఖీంచ్‌లో !*
(ఏదేని ఒక జాతిని నాశనం చెయ్యాలంటే
ముందు దాని నాలుక (భాష) గుంజేసుకుంటే చాలు)

ఈ మాటలు తెలంగాణ భాషను గుంజేస్తూ వస్తున్న ఆంధ్రోల్లకు సరిగ్గ వర్తిస్తాయి. ఆ వరుసలో ఇక్కడి ముస్లింలకు దూరమైన ఉర్దూ విషయంలో గూడ వర్తిస్తాయి. సాహిత్యంలో కొచ్చేసరికి తెలంగాణ ముస్లింలు ఇంకా కొన్ని ప్రత్యేకమైన సమస్యల్ని ఎదుర్కొంటున్నరు. అసలు చదువుకుంటానికే పెద్దగా అవకాశాలు లేని ముస్లింలు తెలుగు మీడియం అదీ సర్కారు బళ్ళలో చదువుకుంటున్నరు. వాళ్ళల్లోంచి కవులు రచయితలుగా ఎదిగిన, ఎదిగి వస్తున్న వాళ్ళకు భాష అనేది ప్రత్యేకమైన సమస్య. వాళ్ళు పాఠ్యపుస్తకాల్లో చదివేది కోస్తాంధ్ర భాష. చుట్టూ సమాజంలో మాట్లాడేది తెలంగాణ భాష. ఇంట్లో మాట్లాడేది ఉర్దూ. మరి వీళ్ళు రచనలు ఏ భాషలో చెయ్యాలె?! లిపికి సంబంధించి తెలుగు నేర్చుకున్నరు కాబట్టి తెలుగు లిపిలో రాస్తున్నరు కాని ఇవాల్టి తరం చైతన్యంతోటి చూస్తే వీళ్ళు తెలంగాణ భాషలోనైనా రాయాలి లేదా ఉర్దూలోనైనా రాయాలె. ఐతే ఉర్దూల రాస్తాన్కి ముస్లిం రచయితలు కొందరు రెడీగనే ఉన్నరు. కాని అచ్చేసుకునే పత్రికలు లేవు. మా పత్రికలు చదివేది తెలుగు వచ్చిన వాళ్లు మాత్రమే కాబట్టి మేము ఉర్దూల రాసినదాన్ని వెయ్యలేము అని పత్రికాధిపతులు అంటున్నరు. అట్లా రెండేళ్ళ కింద రాసిన ఒక కవిత.. చిఠ్ఠి –



## చిఠ్ఠి

అర్బస్తాన్ .....1419 హిజ్రీ

*అమ్మీ అబ్బాకో బడీబేటీ ఫాతిమాకా సలామ్. ఆప్ సబ్ కైసే హై?*

*ఘర్ యాదాతా హై అమ్మీ – ఘర్ కా కోనా కోనా ఆంఖోమె ఫిర్రా... కెత్‌నీ దూర్ హోగయి హూఁ ఆప్ సే...? సోంచేతో దిల్ తడప్ జారా.... క్యా కరూఁ........*

*అబ్బా! రాతోంకో రిక్షా మత్ చలావో... ఫిర్ సే ఖాఁసీ ఆయేతో ముష్కిల్ హోగీ. మెరే షాదిసే థోడే ఖర్జేతో ఫిటే హోంగే. బాజూ వాలోంకా ఖర్జా దేదియేనా? జరా సాఁస్ లేనే ఆతాహుంగా. కోయీ ఖర్జేదార్ ఘర్‌పే గడ్‌బడ్ కరేతో పరేశాన్ మత్ హోనా. లడ్‌నేసే భీ కుచ్‌నహీఁ ఆతా... వో గుస్సేసే బచ్చోంకో బేతుక్కే మారాఁ నక్కోమారో, ఉన్కో యే సబ్ కైసె సమజ్‌మె ఆయేగా అబ్బా! వోతో హబీ మాసూమ్ హైనా! కల్ వోభీ కుచ్ కామ్ మే లగ్ జాతే, ఆప్‌కో కుచ్ సహారా మిలేగా....*

*అమ్మీ! పరేశాన్ మత్ రహ్‌నా. అల్లా జో సమ్‌ఝేగా వహీ హోగా! పరేశానియాఁ సబ్ దూర్ హో జాయేంగే – బార్ బార్ అబ్బాసే ఝుగ్‌డా నక్కోకరో అమ్మీ... మిజాజ్ జత్తన్. ఆరామ్ కర్తే హువే బచ్చోంసే కామ్ లేనా... బచ్చోంకి తబియత్ కైసీ హై అమ్మీ? ఛోటూ చల్తా హోగా... జమీర్ డబల్‌రోటీ బేచ్‌నే జారానా రోజ్? కౌసర్, అఖ్తర్ అరబ్బీ పడ్‌నేతో జాతే హోంగే... అమీనా ఘర్‌కా కామ్ సబ్ ఠీక్ తరేసే కర్తీతో హైనా? పక్వాన్ పూరా ఆగయా ఉసే...!? మేరే ఆజానేకే బాద్ ధోనా పకానా ఝూడ్‌నా ఝూడ్‌నేసేతో వో తంగ్ ఆగయి హుంగీ... ఇన్ సబ్‌కో మెరీ దేవా బోలో... సబ్ ఠీక్‌తో హైనా? మేరా క్యా హై... మైఁ తో హూఁ ఐసీ... ఫిర్ భీ – ఆప్‌కే సాతోఁ దామాద్ సలామత్....!?!?*

• • •

ఇట్లా కాకుండా –మా ముస్లిం జీవితాల గురించి, మా సమస్యల గురించి తెలియాల్సింది చుట్టూ ఉన్న హిందువులకే కాబట్టి పూర్తిగా 'వాళ్ల వశమే అయ్యి' రాస్తాం– అనేటోళ్లున్నారు. ముస్లింలలో ఉన్న గొప్పతనాలు, స్నేహ స్వభావం, ఇస్లాంలోని పాజిటివ్ అంశాల గురించి హిందువులకు తెలిపే ఆ ఒక ఉద్దేశం సరైందేకాని అట్లా తెలుసుకోవడం వల్లనే మొత్తంగా ముస్లింల అవసరాలు, హక్కులు, రిజర్వేషన్లు వగైరా ఎవరో పెద్దమనసుతో వచ్చి కల్పించే పరిస్థితి లేదు. తమ

హక్కుల గురించి, ప్రత్యేక అస్తిత్వం గురించి, సమస్యల గురించి, తమ-పర మతాల ప్రత్యక్ష, పరోక్ష ప్రభావాలవల్ల తమ వెనుకబాటుతనం గురించి ఇటు ముస్లింలు తెలుసుకొని చైతన్యవంతులవడం, అటు హిందువులు వీటిని గుర్తించడం ఏకకాలంలో జరగాల్సి వుంది. తెలుగులో ముస్లింవాద సాహిత్యం ఆ పనే చేస్తున్నది. కాకపోతే అక్షరాస్యతలో అట్టడుగున ఉన్న ముస్లింలకు, ముస్లింవాద రచయితలకు మధ్య దూరం కొంచెం ఎక్కువగా ఉండడం వల్లనే ఆ చైతన్యం అందుకునే స్థితిలో ముస్లిం సమాజం లేకపోవడం గమనించదగ్గ అంశం. అంతేకాక ముస్లింలకు ఉద్దేశించిన పత్రికలు లేకపోవడం వల్ల కూడా ఈ చైతన్యం వాళ్లకు అందే అవకాశం అతి తక్కువగా ఉంది.

ఇక ముస్లిం ప్రత్యేకతను నిలబెట్టే రచనలు తెలంగాణ ముస్లింవాద రచయితల నుంచే వచ్చాయి. దళితులు తమ భాషను, స్త్రీలు తమ ప్రత్యేక సమస్యల్ని కవిత్వంలోకి తెచ్చినట్లే తెలంగాణ ముస్లింవాద రచయితలు తమ ఉర్దూ భాషను, తమ ప్రత్యేక అస్తిత్వం ప్రతిఫలించే ప్రతీకల్ని, వాతావరణాన్ని తీసుకువచ్చారు. అసలు మొదలుగా కవితల పేర్లనే ఉర్దూలో పెడుతూ తెలుగు సాహిత్యంలో ఒక కొత్త ఒరవడిని సాధించారు. పుట్టుమచ్చల్ని, ఆకురాలు కాలాన్ని విదుల్చుకొని, ఖాళీసీసాలు, దర్గామిట్ట కతల్ని వదుల్చుకొని తెలంగాణ ముస్లింవాద కవులు, కథకులు తమ విశిష్టతను కాపాడుకునే యుద్ధం చేస్తున్నారు. జల్‌జలాలు సృష్టిస్తున్నారు.. 'వతన్ కీ మిట్టి'లోంచి కథలు రాస్తున్నారు.

మెజారిటీ, హిందుత్వ ప్రభావాలకు లోనైన వాళ్లు అసలు తాము ముస్లింలమన్న విషయమే మరచిపోయి తాము రాసిన, రాస్తున్న రచనల్లో తమకు సంబంధంలేని, తమ ఇండ్లల్లో, జీవితాల్లో ఎక్కడా తారసపడని ప్రతీకల్ని వేస్తూ పోతున్నారు. అక్కడ వాటికి బ్రేక్ వేసి ముస్లిం ప్రతీకల్తో, ముస్లిం జీవితాల్లోని వాతావరణాన్ని కల్పించింది తెలంగాణ కవులు, రచయితలే. ఈ విషయంలో ముస్లిం కవితకు, కథకూ ఆద్యుడు ఖాజా. కథ విషయంలో రహమతుల్లా, షేక్ హుస్సేన్ (సత్యాగ్ని) ఉన్నప్పటికీ రహమతుల్లా ఉద్యోగరీత్యా తెలంగాణ కొచ్చాకనే ఇక్కడి వాతావరణంలోనే ముందు 'నర్గిస్' ఆ తర్వాత సూర్యాపేట (నల్గొండ) వతన్ ఐన వాళ్ల అత్తమ్మ మీద 'అమ్మీజాన్' కథ రాశాడు. హుస్సేన్ 1989లోనే 'పాచికలు' పేరుతో ఆరు కథల ఒక ముస్లిం కథల సంపుటి వెయ్యడం గమనించదగ్గది. ఈయన వతన్ ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణ తర్వాత వెనకబడ్డ ప్రాంతమైన రాయలసీమ (కడప) కావడం కూడా గమనించదగినదే.



తనవి ముస్లిం వాద కథలు అని చెప్పుకోవడానికి ఇష్టపడని మహమ్మద్ ఖదీర్‌బాబు ఖాజా హరాం కథ తర్వాత రాసిన 'దావత్' కథతో ముస్లిం సబ్జెక్ట్‌పై కథలు రాయడం మొదలు పెట్టాడు. తర్వాత 'జమీన్' కథ రాశాడు. ముస్లింలలోని కొన్ని పాజిటివ్ అంశాల్ని గొప్పగా చెప్పిన కొన్ని కథలు దర్గామిట్ట కతల్లో ఉన్నప్పటికీ ముస్లింల జీవితాల్లోని వాతావరణం ఆ భాష సంస్కృతి వాటిల్లో కొరవడింది. భాషకు సంబంధించి ఉర్దూ పదాలేమోగాని కనీసం సంబోధనా పదాలు కూడా హిందువులవే వాడి (అమ్మా! నాయినా! నాయినమ్మా! లాంటివన్నీ) ఆ కథల్లో ముస్లిం వాతావరణం లేకుండా చేశాడు ఖదీర్. చాలా కథలు పేర్లు మార్చేస్తే ముస్లిం కథలని ఎవరూ అనుకోరు. అదికాక తెలంగాణ తదితర ప్రాంతాల ముస్లిం ఆచార వ్యవహారాలకు నెల్లూరు జిల్లా కావలి ప్రాంతపు వాటికి తేడా స్పష్టంగా కనిపించింది. అవి ముస్లింల కథలు కావుల కేవలం 'దర్గామిట్ట' కతలు కతలు మాత్రమే అని మేము అనుకోవాల్సి వచ్చింది. తర్వాత ఖదీర్ రాసిన కథల్లోనూ పేర్లు మార్చేస్తే ముస్లిం కథలు కాకుండా పొయ్యే ప్రమాదం ఉందనే విమర్శ వినిపిస్తా ఉంది. ఆంధ్రా ప్రాంతపు ముస్లింలపై ఎంతగా హైందవ ప్రభావం ఉందో దీన్ని బట్టి తెలుస్తున్నది. కాని పై లోపం ఏ ముస్లిం రచయితల్లో ఉన్నా గ్రహించి, జాగ్రత్త వహించి మార్చుకోవలసిందే.

తెలంగాణ ప్రాంతం నుంచి 1981 లో నెల్లూరి కేశవస్వామి 11 కథలతో ప్రచురించిన 'చార్మినార్ కథలు'లో ముస్లింల జీవన విధానం, ముస్లిం సంస్కృతి చిత్రీకరణ ఎంతో సహజంగా ఉంది. సంబోధనా పదాలు (అమ్మీ! అబ్బాజాన్! ఆపా! బాబా! లాంటి వెన్నో) ఇంకా మిజ్రా, జనానా,... ఇక్కడి భాషలో ఉండే వందల ఉర్దూ పదాలు (వాటి అర్థాలు బ్రాకెట్లలో ఇచ్చుకుంటూ) రాశారు కేశవస్వామి. ఆ కథలు చదువుతుంటే ఆ ముస్లిం ఇండ్లలో మనం తిరుగాడినట్లే ఉంటుంది. సురవరం ప్రతాపరెడ్డి 'మొగలాయి కథలు'లోనూ ఈ వాతావరణం, ఉర్దూ పదాలు, సంబోధనలు సహజసుందరంగా ఉన్నాయి. ఈ కథలు 1940కి ముందు రాసినవి. 1940లో పుస్తకంగా వచ్చాయి. మరో సంకలనం 'ప్రతాపరెడ్డి కథలు'లో ఇదే తరహా కన్పిస్తుంది. కథల పేర్లు కూడా చాలా మటుకు ఉర్దూలోనే పెట్టారు ప్రతాపరెడ్డి. ఆ తర్వాత తెలంగాణ ప్రాంతం నుంచి ముస్లింల జీవితాల మీద కథలు రాసినవాళ్లే లేకపోవడం (ఒకటి రెండు కథలు తప్ప) గమనించదగ్గది. ఆ పద్ధతిలో ప్రస్తుతం తెలంగాణ నుంచి ముస్లిం కథలు వస్తున్నాయి. వీటికీ ఆంధ్రా ప్రాంతతం నుంచి వచ్చే కథలకు జమీన్ ఆస్మాన్

తేడా ఉంది.

ఖాదర్ 'పుట్టుమచ్చ', అబ్బాస్, బాజీ కొన్ని కవితలు తప్ప మిగతా ముస్లింవాద కవిత్వమంతా తెలంగాణా నుంచే వచ్చింది. అట్లే ఖదీర్ తప్ప మిగతా ముస్లింవాద కథకులంతా తెలంగాణవాళ్లే. ఇట్లా ముస్లిం సాహిత్యం తెలంగాణ నుంచే రావడానికి ఈ ప్రాంతంలోని ముస్లింలలో తాము ముస్లింలుగా జీవించగలిగే సంస్కృతి ఉండడమే కారణం. అస్తిత్వ ఉద్యమాల నేపథ్యంలోంచి తమను తాము, తమ మూలాలని తాము వెతుక్కున్న ముస్లింవాద కవులు తమ ప్రత్యేకతను రకరకాలుగా చాటుతున్నారు. ఏ రకంగానూ ఆధిపత్య మతానికి దాసోహ మవక, లొంగక, తమకు తెలియకుండానే ఆ భావజాలంలో పడి కొట్టుకుపోకుండా తమ సొంత కాళ్ల మీద నిలబడ్డ దగ్గరే, విశిష్టతను నిలబెట్టుకునే తత్వం ఉన్న దగ్గరే ఘర్షణ ఉంటుందనేది ఇక్కడ స్పష్టమవుతున్నది. ఈ ఘర్షణ ఏమాత్రం లేని కవులు, రచయితలు హిందూవైజ్ అయి రచనలు చేస్తూ పోతున్నారు. ఆ వరుసలో కొత్తగా ఇప్పుడు మరికొందరు ముస్లిం కవులు కూడా చేరారు, చేరుతున్నారు.

ఇక్కడ మెజారిటీ మతస్తులకు ఉన్నట్లే మైనారిటీలకు కూడా హక్కులుంటాయనే స్పృహే ఉండకపోవడం ఆశ్చర్యకరం. దోపిడీ చేసే వాడికి దోపిడీకి గురవుతున్నవాడి హక్కుల మీద చిన్నచూపు ఎలా వుంటుందో అలా ఆ హక్కుల గురించి రాయడం, వాటిని ఎదుర్కోవడం మెజారిటీ మతానికి లొంగిపోయి ఉన్న మైనారిటీలకు కూడా తప్పుగానే కనిపిస్తుండడమే ఇక్కడ విచిత్రం. ఆత్మన్యూనతతోనో, అప్పటికి సాహిత్యంలో లేని, రాని ముస్లిం సబ్జక్టు వల్లనో కేవలం సొంత బాధ చెప్పుకోవడం, ముస్లింల స్థితిగతులు చెప్పడంతోనే కోస్తాంధ్ర నుంచి వచ్చిన ముస్లింవాద కవిత్వం ఆగింది. కాని తెలంగాణ నుంచి ఈ కవిత్వం రావడం రావడంతోనే మొదటి స్థాయిని దాటి తమ హక్కు గురించి గట్టి గొంతుతో ప్రశ్నించడం మొదలుపెట్టింది. ఈ గడ్డమీద పుట్టిన అందరిలాగే తమకు అన్ని హక్కులు ఉన్నాయనే స్పృహ లోంచి, జరుగుతున్న అన్యాయం, వివక్ష, అణిచివేతల్ని ప్రశ్నిస్తూ ధిక్కారంగా తమ హక్కుల్ని డిమాండ్ చేయడం దాకా ముస్లింవాద సాహిత్యం వెళ్ళింది. కేవలం ఆంధ్రా నుంచి రాస్తున్న ముస్లింలు, ఆంధ్ర ప్రభావంలో పడి కొట్టుకుంటున్న ఖమ్మం జిల్లా వాళ్లలోంచి కొందరే ఇంకా మొదటి స్థాయిలోనే లేదా అందులోంచి కూడా తప్పుకుంటూనో ఉన్నారు.

*2001, 'తెలంగాణ తోవలు' వ్యాస సంకలనం*



# ముస్లింవాదానికి నిజమైన నిర్వచనమిచ్చింది తెలంగాణ ముస్లింలే!

స్త్రీ దళిత వాదాల క్రమంలో తెలుగు సాహిత్యంలో ముస్లింవాదం మొదలై వేళ్లూనుకొని విస్తృతమైన చర్చకు ద్వారాలు తెరవడం తెలిసిందే. అయితే స్త్రీ, దళిత వాదాలు కేవలం తమ జాతుల పాజిటివ్ అంశాలకే పరిమితమైతే, అంటే తమ జాతిని అణచివేస్తున్న అవతలి వర్గాలపై దాడి చేయడం, ప్రశ్నించడం వరకే పరిమితమైతే, ముస్లింవాదం మాత్రం అక్కడితో ఆగలేదు – ముస్లింలపై కనబడని మెజార్టీల వివక్ష, అణచివేతలను ప్రశ్నిస్తూనే ఆరెస్సెస్, బీజేపీ లాంటి దుష్ట దాష్టీకాన్ని బహిరంగంగా ఖండించడంతోనే ఆగలేదు.. తమ జాతి స్త్రీలను తమ పురుషులే మతం ముసుగులో ఎలా అణచివేస్తున్నారో ధైర్యంగా ప్రశ్నించింది. అలాగే 'హిందూ' జాడ్యంగా తమకూ అంటిన కులతత్వాన్ని ఎత్తి చూపింది. ఇంకాస్త ముందుకెళ్లి ముస్లిం సంస్కృతిని కవిత్వీకరిస్తూ 'అలావా' సంకలనం వేస్తూ ఒక సమాంతర సంస్కృతిని ప్రత్యామ్నాయ సంస్కృతిగా ప్రతిపాదించింది. వాదం ఉధృతిగా నడుస్తున్న కాలంలోనే ఏ ఇతర అస్తిత్వ వాదాలు వేయలేకపోయిన కథల సంకలనం 'వతన్' ముస్లిం కథలను వేసి ముస్లిం సాహిత్యంపై విమర్శలు చేస్తూ, అక్కసు వెళ్లగక్కుతున్న కువిమర్శకుల నోళ్లు మూయించింది. సంకలనం మీద సంకలనం వేస్తూ, సభలూ సమావేశాలతో చర్చోపచర్చలతో ఇతర అస్తిత్వ ఉద్యమాలకే మార్గ నిర్దేశనం చేసింది. అలాంటి ముస్లింవాదం మొత్తం ఆంధ్రప్రదేశ్ నుంచి వచ్చినట్లుగా ఒక పిక్చర్ కనిపిస్తున్నది కాని, తరచి చూస్తే ముస్లింవాద సాహిత్యం దాదాపు 80 శాతం తెలంగాణ నుంచే రావడం విశేషం. పైన పేర్కొన్న విభిన్న పార్శ్వాలన్నీ తెలంగాణ కవుల నుంచే వచ్చాయి. తొలి కవిత 'పుట్టుమచ్చ' రాసిన ఖాదర్ మొహియుద్దీన్ తప్ప మిగతా ముఖ్య కవులు – రచయితలంతా తెలంగాణ వారే. ముస్లింవాద ప్రతినిధిగానే కాక దూదేకుల సాహిత్యానికి ప్రతినిధిగా ఖాజాను, ముస్లింవాద ప్రతినిధిగానే కాక ఆ వాదం స్థిరీకర్తగా స్కైబాబను, ముస్లిం స్త్రీ

సాహిత్య ప్రతినిధిగా షాజహానాను, లౌకికవాద ముస్లిం సాహిత్య ప్రతినిధిగా యాకూబ్‌ను, ముస్లిం కవిగానే కాక విమర్శకుడిగా అఫ్సర్‌ను మనం చెప్పుకోవచ్చు.

కేవలం ఒకే ఒక్క కవితతో బతికిపోయిన ఖాదర్ ప్రయాణం తర్వాత్త రువాత ముస్లింవాదం నుంచి ఇస్లామీకరణ వైపునకు పయనించడం చిత్రం. 'అలావా' ముందు మాటలో ముస్లింవాదం అంటున్నా ఆచరణా, ఆలోచనల రీత్యా ఆయన పూర్తి 'ఇస్లామీ' అయిపోయారు. అదే ధోరణిలో ముస్లింవాదులైన ఖాజా, స్కైబాబలపై అసహనం వ్యక్తం చేశారు. వీరివల్ల ముస్లిం సాహిత్యానికి ఏదో నష్టం జరిగినట్లు బుకాయించారు. దానిని ఇతర సాహిత్యకారులు ఖాజా, స్కైబాబాలపై ఖాదర్‌కున్న జెలసీగా చూశారే తప్ప ఎవరూ పట్టించుకోకపోవడం తెలిసిందే. ఇక ఖాన్ యజ్దాని (ఉషా-ఎస్-డానీ) సాహిత్యకారుడు కాకపోయినా విమర్శకుడిగా పేరున్నా ఆయన ముస్లిం సాహిత్యంపై చేసిన ఒకే ఒక విమర్శనా వ్యాసంలో (వార్త దినపత్రికలో) ఖాజా, స్కైబాబ తదితర ముస్లింవాద కవులను మొస్సద్ ఏజెంట్లుగా చిత్రించే ప్రయత్నం చేసి, దెబ్బతిన్నారు. ఇక ముస్లింవాదాన్ని విమర్శించడానికి ఇస్లాం వాద దుకాణం ఒకటి తెరిచిన కరీముల్లా ఒక కాపీ కవిగా అవతరించాడు. ముస్లింవాదం మత వాసనేస్తుందన్న విమర్శను ఖండిస్తూ 'ఆంధ్రజ్యోతి 'వివిధ'లో మేం ముస్లింవాదం అంటున్నాం, ఇస్లాం వాదం అనడంలేదు' అన్న వాక్యంలోంచి 'ఇస్లాంవాదం'ను కాపీ కొట్టిన ఈ ముల్లా ఇక అప్పటి నుంచి ముస్లింవాదులు సృష్టించిన కవితల్ని తిరగేసి రాస్తూ ముస్లింల కవి ననిపించు కునే ప్రయత్నం చేశాడు. ఖాజా నిషానీ కవితను, షాజహానా 'ఈద్ ముబారక్' కవితను, ఖలందర్ కానారుఖ్జాల్ కవితను కాపీ చేయడం చిన్న ఉదాహరణలు మాత్రమే. ముస్లింవాదులు ఏం చేయబోతుంటే వారి ప్రయత్నం పూర్తి కాకముందే తాను ఆ పనులను ఆదరాబాదరాగా, ఏ మాత్రం ప్రభావం చూపడానికి పనికిరానట్లుగా చేసి, మరిన్ని గట్టి సంకలనాలు రాకుండా, మరింత శక్తివంతమైన సంస్థ ఏర్పడకుండా చేశాడు. దానికో ఉదాహరణ 'జంగ్' ముస్లిం రిజర్వేషన్ కవితా సంకలనం. అట్లే ముస్లిం రచయితల సంఘం. ఈ చిల్లర చేష్టల వల్ల మేము తీసుకురావాలనుకున్న 'మర్ఫా' ముస్లిం రిజర్వేషన్ కవితా సంకలనం ఆపేశాం. అలాగే ముస్లిం రచయితల వేదిక అందరి ప్రాతినిధ్యంతో పెద్ద ఎత్తున ఏర్పాటు చేయాలనే ప్రయత్నం ఇబ్బందిలో పడింది. ముస్లింవాదుల వరకు 'హర్యాలి'



ముస్లిం రచయితల వేదికను ఏర్పాటు చేసుకున్నాం. ఇంకా కరీముల్లా, జమాతె ఇస్లామీ పత్రిక 'గీటురాయి' ఆఫీసులో తికానా వేసి ఆ పత్రిక జర్నలిస్టులను, ఆ పత్రికలో మత ప్రచారం కోసం వ్యాసాలు రాసేవారిని ఓ చిన్న గుంపు చేసి ముస్లింవాదులపై విమర్శలు చేసే ప్రయత్నం చేశాడు. వరుసగా పత్రికలన్నింటిలో ఒక్కో వ్యాసం రాసి ప్రతి వ్యాసంలో ముస్లింవాదులపై అబద్ధాలు రాస్తూ, నిందలు, ఆరోపణలు చేస్తూ పోయాడు. ఇస్లాం వాదం అంటూనే దాని స్ఫూర్తికి విరుద్ధంగా పచ్చి అబద్ధాలు రాశాడు. అయినా ఇస్లాంవాదం అనడం సరైంది కాదని, ముస్లిం వాదం అనడమే సరైందనీ, ముస్లింవాదం సామాజిక విషయాలకు స్పందిస్తుందనీ, ఇస్లాం గురించి చెప్పడానికి మత గ్రంథాలతో పాటు మత సంస్థలు, జమాత్‌లు, మజీద్‌లు, ఈద్గాలు, ఇస్తెమాలు ఎన్నో ఉన్నాయని చెబుతూ స్థిరంగా నిలుచున్న ముస్లింవాదులు చివరికి నెగ్గారు. ఇస్లాంవాదినని బుకాయించిన కరీముల్లా, ముస్లిం ప్రగతిశీలవాదం అంటూ మరో మాట ముందుకు తెచ్చే ప్రయత్నం చేశాడు. ఈ నాటకాలన్నీ చూసిన తెలుగు సాహిత్యకారులు అప్పటికే వీరిని పట్టించుకోవడం మానేశారు. ఇక కథకుల్లో ఒక్క ఖదీర్‌బాబు తప్ప మిగతా ముస్లింవాద కథకులంతా తెలంగాణవారే కావడం విశేషం. రహమతుల్లా రెండు దశాబ్దాల క్రితమే తెలంగాణకు వచ్చేసిన- ఒంగోలు జిల్లాలో పుట్టి పెరిగిన వాడు. రహమతుల్లా రాసిన ఒక్క 'బా' కథ తప్ప మిగతా ముస్లింవాద కథలన్నీ తెలంగాణ నేపథ్యంలోంచి పుట్టినవే కావడం గమనించవచ్చు.

ఖాదర్ మొహియుద్దీన్, డానీ, ఖదీర్‌బాబు మరో ఒకరిద్దరు ఆంధ్రావారితో కలిసి తెలంగాణ విషయంలో ఒక రోజు ప్రెస్‌క్లబ్‌లో స్కైబాబతో గొడవ పడడం అందరికీ ఆశ్చర్యం కలిగించింది. ముందుగా స్కైబాబ మీద ఖదీర్‌బాబు విరుచు కుపడుతూ – ఈయన తెలంగాణ గురించి మాట్లాడుతూ ఉండేసరికి ముస్లిం రచయితలు తెలంగాణ గురించి మాట్లాడుతున్నారేమని సీపీఎం (ప్రజాశక్తి) వాళ్లు మమ్మల్ని అడుగుతున్నారని, ఈయన 'వతన్' కథల సంకలనంలో తెలంగాణ కథలు, రాయలసీమ కథలు, కోస్తాంధ్ర కథలు అని డివైడ్ చేసి ముస్లిం రచయితల్ని వేరు వేరుగా చూపడం ఏమిటి? అని పెద్ద గొంతుతో అరుస్తుండడంతో అక్కడున్న తెలంగాణ కవులైన యాకూబ్ పాషా, షాజహానా, వలీ హుసేన్, ఖాజా అవాక్కయ్యారు. తర్వాత ఖాదర్ మొహియుద్దీన్ అందుకుని 'తెలంగాణ రావడం వల్ల ముస్లింలకు ఎంత నష్టమో తెలుసా?' అని గట్టిగా

ప్రశ్నించాడు. మాట్లాడితే ముస్లింల గురించో లేదా తెలంగాణ గురించో మాట్లాడాలని, రెండింటి గురించి మాట్లాడితే బాగుండదని ధమ్కీ ఇచ్చే ప్రయత్నం చేశారు. వారికి డానీ వత్తాసు పలికాడు. ఇదీ వీరి ప్రగతిశీలత. ప్రోగ్రెసివ్‌నెస్.

తెలంగాణ ముస్లింవాద కవులు, రచయితలు మెజారిటీ దాష్టీకాన్ని దునుమాడుతూనే తమ కమ్యూనిటీలోని తప్పొప్పులను కూడా ఎత్తి చూపారు. ముస్లింలలో సంస్కరణలు రాకుండా ముస్లిం కమ్యూనిటీ బాగుపడడం కష్టమని తేల్చారు. కానీ కోస్తాంధ్ర వాసులు మాత్రం అవకాశవాదులుగా మారి ముస్లిమేతరుల దాష్టీకాన్ని ఎత్తిచూపడం వరకే పరిమితమయ్యారే తప్ప తమ ముస్లిం సమూహంలోని తప్పులను ఎత్తి చూపడానికి సంసిద్ధంగా లేకపోగా అలా ధైర్యంగా రాసినవారిని ముస్లిం వ్యతిరేకులుగా చూపే ప్రయత్నం ఎక్కువగా చేశారు.

మొత్తంగా చూస్తే కోస్తాంధ్ర ప్రాంతం నుంచి వచ్చిన ఖాదర్ మొహియుద్దీన్, డానీ, కరీముల్లావాదులు, ఖదీర్‌బాబు లాంటివారు భావజాలపరంగా (తమ అంతరాంతరాల్లో దాగిన అసలు రూపం బయటపడి) ఇస్లాంవాదులుగా తేలారు. తెలంగాణ నుంచి వచ్చిన కవులు, రచయితలు, రాయలసీమ నుంచి ముఖ్యంగా కడప వాసులు, కర్నూలు నుంచి ఇనాయతుల్లా మాత్రమే ముస్లింవాదులుగా నిలవడం విశేషం. పైగా కోస్తా వాసులు కొత్తగా రోజా (ఉపవాసం) ఉంటూ, నమాజులు చేస్తూ తాము ముస్లింలమని చాటుకునే ప్రయత్నంలో పడ్డారు. ఆఖరికి విశ్వాసం ఉన్నవారే ముస్లింలు అని ప్రచారం చేస్తూ ముస్లింవాదులు అవిశ్వాసులనే ప్రచారం కూడా చేస్తున్నారు. చివరికి కోస్తాంధ్ర ముస్లిం రచయితలు ఇలా తయారవుతారని ఊహించని ఎంతో మంది ప్రగతిశీల రచయితలు, ముస్లింవాదులు తాము అమితాశ్చర్యానికి లోనవుతున్నట్లు చెబుతున్నారు.

*మార్చి 2010 'సింగిడి' పత్రిక*



# గుజరాత్ ముస్లిం జాతి హత్యాకాండ ..ముస్లింవాద కవి ఆక్రందన

'హమ్ మర్కే భీ జగాతే హైఁ
సోయీ హుయీ దునియాఁ కో!'

• • •

అహ్మదాబాద్, నరోడా పాటియా, ఓడ్, కిడియాద్, డెలోల్, సర్దార్‌పూర్, పాండర్వా, అంజన్వా, లిమ్‌ఖేడా,... 16 జిల్లాల్లోని ఎన్నెన్ని ఊర్లు, ఎన్నెన్ని పట్నాలు.. అంతా ముస్లింల రక్తంతో తడిసి ముద్దయిన భూమి.. బాజాప్త కాషాయ తలకట్లు, ఖాకీ నెక్కర్లు ధరించి త్రిశూలాలతో కరవాలాలతో బరిసెలతో జరిపిన ఆటవిక దాడుల్లో అల్లకల్లోలమైన ముస్లింలు.. ఆ జఖ్మీ దేహాలను కదుపుతూ మే 30 నుంచి జూన్ 13 దాకా గుజరాత్‌లో తిరిగి వచ్చాం నేను, మరో నలుగురు మిత్రులం. మేము తప్ప ఎవరూ వెల్లని ఒక ఊరు– సంజేలి. 9 జూన్ రాత్రి 8 గంటలకు దాహోద్ జిల్లా కేంద్రానికి 60 కి.మీ.ల దూరంలోని గిరిజన ఏరియాలో ఉన్న ఆ ఊరిలో దిగాం.

సగం ఊరు (కరెంట్) వెలుగులో, సగం ఊరు చీకటిలో ఉంది. వెలుగున్న చోట బస్సు మమ్మల్ని దింపినా ఎవర్ని అడగాలన్నా భయమేసి అడగకుండా చీకటివైపు నడిచాం. కూల్చి తగలబెట్టబడ్డ 468 ఇండ్ల చీకటి.. నల్లటి బూడిద కుప్పల, సగం విరిగిన నల్లని మొండి గోడల మధ్య ఆ మట్టిమీది ఆ ఇంటిమీది మమకారం చావని మనుషులు.. అక్కడక్కడా కిరోసిన్ బుడ్డి దీపాలతో.. చిన్న చిన్న గుంపులుగా.. ఆ వీధిలోంచి నడుస్తుంటే– ఎంత భయం గొలిపే సన్నివేశమో.. కూల్చి ఉన్న ఒక మజీదు దగ్గరి పెద్ద గుంపును కదిపాం.. ఆ రాత్రికి మేము ఆ ఊరి ముస్లింల మెహ్‌మాన్ (అతిథులం). కూల్చగా మిగిలిన ఆ మజీదు మా పడుకున్న చోటు. ఆ రాత్రి ఎన్నెన్ని గాథలు విన్నామో...

ఆ 468 ఇండ్లలో చెంచా కూడా మిగలకుండా దోచుకొని 24 గంటలసేపు

ఆ ఇండ్లను కూలగొట్టి తగలబెడితే కేవలం దేహాలు మాత్రమే దక్కించుకుని ఆ కాళరాత్రి చెట్టుకొకరు పుట్టకొకరుగా పరుగులు పెట్టి 2 నెలల తర్వాతగాని తిరిగి తమ ఊరు భయభయంగా చేరిన వాళ్లు, తమపై 10 వేలమందికి పైగా దాడి చేసిన భయవిహ్వాల గాధని వివరిస్తుంటే మూడున్నర నెల్ల తర్వాత కూడా వాళ్ల మొఖాల్లో కనిపించని వెలుగుని వెతుక్కుంటూ ఉండిపొయ్యాం మేము. 'కహాఁ జాయేంగే? మరే తో యహీఁ మరేంగే.. జన్మభూమితో యహీ హై..' గుజరాత్ బాధితులెందరి నోటి నుంచో విన్నట్లుగానే అక్కడా విన్నాం.. గుజరాత్ అంతా ఆవరించిన అట్లాంటి చీకటిని ఆరునెల్లకు కూడా వెలుగులోకి రాకుండా చేస్తున్నది అక్కడి హిందూ 'రాజ్యం!' మల్ల మాట్లాడితే దేశమంతా అదే చీకటి వ్యాపింప జేస్తాం అంటున్నది. అయినా ఎవరూ నోరు మెదపడానికి సిద్ధంగా లేరు..

ఆ సంజేలి ఊరి వాళ్లు మార్చి ఒకటో తేదీ రాత్రి తామంతా ఎన్నెన్ని రకాలుగా ఊరొదిలి పారిపోవాల్సి వచ్చిందో కథలు కథలుగా చెప్పారు. ఆ ఊరి చుట్టూ 25 కి.మీ.ల దాకా ఆదివాసీలు ఉన్నట్లు, దాదాపు 50 ఊర్ల నుంచి 10 వేల మంది దాకా తమపై దాడి చేసినట్లు చెప్పారు. ఆదివాసీ ప్రాంతాల్లో వి.హెచ్.పి., ఆరెస్సెస్, భజరంగ్‌దళ్, బి.జె.పి.లతో పాటు పది, పదిహేనేళ్ల నుంచి యోగేశ్వర పరివార్, గాయత్రీ పరివార్, సద్విచార పరివార్, స్వామి నారాయణ సాంప్రదాయి,... లాంటి సంస్థలు పని చేస్తున్నాయని చెప్పారు. ముస్లింలమీద రకరకాల విష ప్రచారాలతో ఆదివాసిల్ని వాళ్లు రెచ్చగొట్టి దాడులకు తీసుకొచ్చినట్లు చెప్పారు. ఒకర్ని తూటాతో, నలుగుర్ని నరికి తగటబెట్టి, ఐదుగుర్ని రాళ్లతో కొట్టి చంపేశారు. మరో ఐదుగురు టెంపో, జీప్‌లలో వత్తిడికి గురై చచ్చిపోయారు.

ఈ ఊర్లోనే కూలిన గోడల మీద 'ముసల్మానోంకో మారో - కాటో - జలావో', 'జిస్ మొహల్లే మే అల్లా హోగా వో మొహల్లా జలేగా', 'హిందుస్తాన్ మే రహెనా హోతో హిందూ బన్‌కే రహో', 'పహ్‌లీబార్ సబ్‌కుచ్ బచా.. దూస్రీబార్ బచీ జాన్.. తీస్రీబార్ నామోనిషాన్ మిట్ జాయేగా' లాంటి నినాదాలు రాసి ఉన్నాయి. 'యే ఒన్‌సైడ్ ఎలాక్ హై- ముసల్మానోంకో సఫాయా కర్నేకా' అంటున్నారు. తమపై దాడికి నాయకత్వం వహించినవాళ్లు కొందరు బయటినుంచి వచ్చివాళ్లలా కనిపించారని చెప్పారు- 'కోయీ కెమికల్ దాల్తే హైఁ, కోయీ కాడీ ఖీస్తే హైఁ, కోయీ గోలీ చలాతే హైఁ.. సబ్ ట్రెయిన్‌డ్ థె!' ఊరివాళ్లు కొందరు, చుట్టుపక్కల ఊర్లవాళ్లు కొందరు నాయకత్వం వహించిన వాళ్లలో ఉన్నారని చెబుతూ ముప్పై



పేర్లు చెప్పారు..

ఆ తెల్లారి మేము ఆ ఊరి మాజీ సర్పంచ్ (కాంగ్రెస్) విద్యావంతుడు, రాజవంశీయుడైన కాలికా కుమార్ బణాను కలిసి గంటసేపు మాట్లాడాం. అతని మాటలు కొన్ని.. 'ఆ రోజు సాయంత్రం వరకు నేను ఎన్నో రకాలుగా ప్రయత్నించాను. చివరికి నా వల్ల కాదని అర్థమైపోయి పారిపోండని కళ్లనీళ్లతో ముస్లింలకు చెప్పాను. ఇక్కడ అడవుల్లో అక్కడక్కడా ఒక్కో ఇల్లు కూడా ఉంటుంది. కాబట్టి లైసెన్స్‌డ్ వెపన్స్ ఉంటాయి. వాటిని ఈ దాడుల్లో విరివిగా వాడారు.. ట్రైబల్ బెల్ట్ కాంగ్రెస్‌తో ఉంది. దాన్ని బిజెపి వైపు మల్చుకోవడం ఇలా సాధ్యమైంది.. డెమొక్రసీ సెన్సిటివ్ అంశం. వీళ్లు దాన్ని డిస్టర్బ్ చేశారు. దాంతో చైన్ సిస్టమ్ అంతా డిస్టర్బ్ అయిపోయింది.. 80ల్లో మాధవ్‌సింగ్ సోలంకి ఎస్సీ ఎస్టీ బీసీ మైనారిటీ నినాదంతో థర్డ్ పార్టీకోసం ప్రయత్నించాడు.. ప్రస్తుతం మూడు ప్రత్యామ్నాయ పార్టీ ఏదీ లేకపోవడం కూడా ఇక్కడ సమస్య అవుతూ ఉంది.. దాడుల తర్వాత ఇప్పటికీ పరిస్థితి ఏమీ మారలేదు. దాడులు చేసిన వాళ్ల మైండ్‌సెట్ ఏమాత్రం మారలేదు. మార్చడానికి ప్రయత్నాలేవీ జరగడం లేదు. జరిగితేనే వాల్లు మారడానికి చాలా సమయం పడుతుంది. జరగడం లేదు కాబట్టి మళ్లీ దాడులు జరగవచ్చు.. పోలీసులు ఏమీ పట్టించుకోవడం లేదు.. మైనారిటీ కమీషన్, హ్యూమన్ రైట్స్ ఫోరంలు బాధితుల తరఫున ఎఫ్.ఐ.ఆర్.లు బుక్ చేయిస్తే బాగుంటుంది. ఇక్కడ హిందూ, ముస్లింల మధ్య ఎకనామికల్ క్లాష్ ఏమీ లేదు.. మహారాష్ట్ర, రాజస్థాన్, మధ్యప్రదేశ్‌లలో ప్రస్తుతం బిజెపి గనక అధికారంలో ఉండి ఉంటే ఇలాగే అక్కడ కూడా దాడులు జరిగేవి..'

## తీగ తెంపబడ్డ మొగ్గలు

పంచ్‌మహల్ జిల్లా హాలోల్ తాలూకా కేంద్రంలో ఉన్న శిబిరంలో 12 మంది పిల్లలు బాగా డిస్టర్బ్ అయ్యి ఉన్నారు. అందులో ఒక పిల్లవాడు రాత్రిని చూడలేకపోతున్నాడు. కాలోల్ తాలూకాలో ఇంతియాజ్ అనే 5 ఏళ్ల పిల్లవాడు ప్రతిరెండు రోజులకు PTSD (Post Traumatic Stress Disorder) కి గురవుతున్నాడు. కనీసం 20 ఏళ్లయినా డిస్టర్బ్ చేసే వ్యాధట ఇది. ఈ పిల్లవాడు తన తల్లిని నరికి తగలబెట్టడం చూశాడు. అతనికి అమీర్(7), మొయిన్(3) అనే అన్నదమ్ములు ఉన్నారు. అరాల్ ఊర్లో పొలాల్లో దాచుకున్న ఒక కుటుంబం - ఏడుగుర్ని నరికి తగలబెట్టారు. వాళ్లమ్మాయి హీనా(7) అదంతా చూసింది. ఇప్పుడా అమ్మాయి కింద ఏమన్నా పడ్డా బెదిరిపోతున్నది. డిరోల్ రైల్వే స్టేషన్‌లో

దిగి వెళ్తున్న 6గురు ఆడవాళ్లని, 4గురు మగవాళ్లని నరికి తగులబెట్టారు. వాళ్ల పిల్లలు చెట్లలో ముండ్లలో దాచుకొని చూస్తుండిపోయారు (సిరాజ్(5)ను అన్న ముస్తఫా(10) నోరు మూసి దాచాడు). సంజెలిలో తల్లిదండ్రుల్ని నాయనమ్మ తాతల్ని నరికి తగలబెడితే ఆరునెలల అమ్మాయి అనాధగా మిగిలిపోయింది. సర్దార్‌పూర్ ఊర్లో తల్లిదండ్రుల్ని, సోదరిని తగలబెట్టేస్తే సల్మా(4), దిలావర్(12) అనాధలయ్యారు. వీరికన్నా చిన్నపిల్లలు మరో ఇద్దరి తల్లిదండ్రుల్ని కూడా చంపేశారు. ఇట్లా ప్రతి ఊరికి ఎందరో పిల్లలు...

ఢిల్లీ నుంచి మాలాగే వచ్చిన గౌరవ్ డిగ్రీ అనే యువకుడు మాతో కాలోల్‌లో మాట్లాడుతూ 'ఎన్ని వేలమందిని చంపేశారో అన్ని వేలమంది పిల్లలైతే అనాధలై ఉంటారు కదా. అన్ని వేలమంది పిల్లలు తమ తల్లిదండ్రుల్ని చంపేయడం చూసే ఉండొచ్చు.. ఒక జనరేషన్ ఖరాబై పోయినట్లే! తల్లిదండ్రుల ఆక్రందనలు ఆ పసి హృదయాల్లోంచి ఎలా మాసి పోతాయి?! వాళ్లు జీవితాంతం డిస్టర్బ్‌డ్‌గానే ఉంటారు...' అంటూ బాధపడ్డాడు.

**2**

మేం తిరిగిన 5 జిల్లాల్లో బాధిత ముస్లింల ఫీలింగ్స్...

– 'ఈ మూడున్నర నెల్లనుంచి మా కంటిమీద కునుకులేదు. గుండెల్లో ఎప్పుడే మవుతుందో అన్న భయం ఇంకా వెంటాడుతూనే ఉంది. గోద్రా సంఘటన తర్వాత ఇండ్లు షాపులూ, అన్ని రోజులు ప్రేమించిన అన్నిటినీ అందరినీ వదిలి ఎవరి ప్రాణాలు వాళ్లం కాపాడుకుంటానికన్నట్లు పరుగులు పెట్టాం. అర్ధరాత్రిళ్లు అడవులూ, కొండలూ ఏమీ పట్టించుకోకుండా చెదిరిపోయాం. ముస్లిం జనాభా ఏ ఊర్లో ఎక్కువుందో అక్కడికి చేరడానికే అన్ని వూర్ల వాళ్లమూ ప్రయత్నించాం. ఒక ఊరి నుంచి పారిపోయిన వాళ్లు పక్క ఊర్లలోనూ నరకబడిన సంఘటనలు ఉండడంతో పక్క ఊర్లలో కూడా రక్షణ లేదని చెట్లలోంచి, పుట్టల్లోంచి పడి కొన్ని పదుల కి.మీ.ల దూరంలో ఉన్నప్పటికీ ముస్లిం జనాభా ఎక్కువున్న తాలూకా కేంద్రాల్లోకి పారిపోయి వచ్చాం...'

– 'యే ఎకనమిక్ క్లాష్ నహీఁ హై'

– 'ప్లాన్ హై ముసల్మానోంకా సఫాయ కర్నేకా'

– 'రామ్ కే నామ్ ఇన్‌సానోంకో కాట్‌తే హైఁ'

– 'ఏక్‌ఏక్ గాఁవ్ ఏక్‌ఏక్ జలియన్‌వాలాబాగ్!' –తీన్ మహీనోఁ సే భూకె, ప్యాసె..'



– 'ఆంఖోఁ కె అంధే హైఁ.. కానోంకె భైరే హైఁ'

– 'ఖానా హరాం సోనా హరాం' (మేము మాట్లాడిన ముస్లింల కొన్ని ఇండ్లలో క్యాలెండర్లు ఫిబ్రవరి నెలనే చూపుతున్నాయి. కాలోల్ తాలూకా కేంద్రంలో ఒక రాత్రి ఒక ఇంట్లో మమ్మల్ని పడుకోమన్నారు. అక్కడి గోడ గడియారం కూడా ఆగిపోయింది. క్యాలెండర్ ఫిబ్రవరి నెలను చూపుతుంది.)

– 'హమ్ గరీబోంకి కోన్ సున్నేవాలా హై'

– 'ముస్లింకె ఘర్ జలాయె గయేతో ముస్లింకో హీ ముజ్రిమ్ బనాయా గయా'

– 'హమ్ కోయీ పరాయే నహీఁ హై.. హమ్ ఇండియా మే హీ రహనే వాలే యే హమారా భీ దేశ్ హై'

– 'లూట్‌నేకే లియే ఐసా కహీఁ భీ పైసా నహీఁ దియా గయా!'

– 'సిరిఫ్ ముసల్మానోంకె లియే కర్ఫ్యూ థా'

– 'యే సబ్ జాన్‌తే హై, ఇదర్ క్యా హోరా – మగర్ కోయీ క్యానై ఆవాజ్ దేతే, ఉన్ కో కుర్సీ చాహియే..' – 'గిల్ కో హిందూస్ కే సేఫ్టీ కే లియే బులాయాగయా'

– 'మా వాళ్ల అవశేషాలు దొరికితే లక్ష రూ.లు ఇస్తారని దొరక్కుండా తగలబెట్టారు.'

– '13 మందిని పొలాల్లోంచి గుంజుకొచ్చి ఒక బావిలో ఎత్తేసి పై నుంచి పెద్ద పెద్ద రాళ్లెత్తేసి చచ్చిన శవాల్ని బతికిన వాళ్లని మళ్లీ బైటికి లాగి అందర్ని తగలబెట్టారు.'

– 'ఎన్ని ఏండ్ల నుంచో ప్లాన్ చేస్తేగాని, ఇన్నివేలమందిని చంపేపని సక్సెస్ కాదు'

– 'ఈ మూడున్నర నెల్ల నుంచి ఏ రోజూ మేము మనశ్శాంతిగ లేము. ప్రతిరోజూ భయమే... ట్రైన్ తగలబడిన తర్వాతి రోజుల్లో అలా.. మార్చి 15 శిలాదానం అన్నప్పి.. తర్వాత ర్యాలి అన్నప్పి.. రథయాత్ర అన్నప్పి.. ఇంకా ఎన్నో రకాల పుకార్లతో భయం భయంగా గడుపుతున్నాం..'

– 'యహాఁ ఔరతోం కే యోని మే లక్‌డా గుసడ్‌కే సతా సతాకే మార్‌డాలా'

– 'జంగల్ మే బందర్ జైసా పత్తే ఖాయే'

– 'వో లోగ్ పశ్తాయేంగె.. (నిర్దోషులైన మమ్మల్ని ఇట్లా చేశారు. వాళ్లు ఎప్పటికైనా పశ్చాత్తాప పడతారు అన్నీ.. ఊపర్‌వాలా దేఖ్‌లేగా అనీ అంటున్న అమాయకత్వానికి జాలిపడాలో, ద్వేషపడాలో అర్థం కాలేదు. కాని అంతటి బీభత్సాన్ని మాత్రం

ముస్లింలు, మజీదులకు వెళుతూ దువా చేసుకుంటూ ఉండడం వల్లే తట్టుకోగలగడమో, ఉపశమనం పొందడమో జరుగుతుందని మాత్రం అనిపించింది)'

– 'ఇప్పటికే ముస్లిం ఏరియాలు సెపరేట్ అయిపోయాయి'

– 'రాజకీయాల నుంచి మతాన్ని వేరు చెయ్యాలని కనీసం లెఫ్ట్ పార్టీలన్నా నినదించడం లేదు. అలా జరిగితే ఈ పరిస్థితి రాకపోయేది..'

– 'పెద్ద షాపులుండేవి మాకు. ఇవాళ కూలికి పోవాల్సిన పరిస్థితి'

– 'ఇంట్లో అన్ని సౌకర్యాలతో, సామాన్లతో ఉండేవాళ్లం. ఇవాళ అడుక్కు తింటున్న పరిస్థితి' – 'ఫిబ్రవరి 28 నుంచి నిన్న మొన్నటి వరకు మా ఇండ్లను, షాపుల్ని దోచుకుంటూనే ఉన్నారు'

– 'బక్రా అచ్ఛా హై, ఇసే 307 మే దాల్దో!' – 'బక్ర అచ్ఛా హై, ఇసే 302 మే రఖో' –(అని ముస్లిం యువకులపై కేసులు బనాయించారు పోలీసులు)

– 'కైసే జియేంగే, కహాఁ జాయేంగే..'

– 'హమే కంపెనీ సే నికాల్ దియా..' (కాలోల్ దగ్గర్లోని GIDC ప్లాస్టిక్ కంపెనీలో 20మందిని తీసేశారు. దాడుల తర్వాత గుజరాత్ అంతా చాలా ప్రైవేట్ కంపెనీలలో ముస్లింలను ఉద్యోగాల్లోంచి తీసివేశారు)

– 'ఔర్ కహీఁ భీ హో ఐసా నహీ హోనా – యే హమ్ గరీబోంకీ దువా హై'

– 'అసలు ఏం జరగకుండా ఉందిక్కడ? జరగకుండా ఉన్నదేదీ లేదు. మీరడగండి, ఒక్కొక్కరు ఒక్కో కథ చెప్తారు. వీళ్ల మీద జరిగింది, వాళ్ల నోటితోనే ఒక్కో తీరుగా ఒక్కో కథ చెప్తారు. ఏం జరగలేదు మా మీద?'

– 'పోలీస్ కుచ్ న కరేతో 'ఓ లోగోంకో హిమ్మత్ ఖులేగీ..'

– 'మేం చెబుతుంటే మీరు ఊహిస్తున్నారు. మేము అనుభవించాం. ఎంత తేడా ఉంటుందో ఆలోచించండి'

– 'దాడులు చేసిన వాళ్ల ముసలివాళ్లు మమ్మల్ని చూసి కళ్ల నీళ్లు పెట్టుకుంటున్నారు'

– 'మేరా దిల్ పూరా జల్ గయా భాయ్, కుచ్ నహీఁ హై మేరె పాస్, సిరిఫ్ అల్లా కే సివా..' – '40 సాల్ కీ కమాయీ ఏక్ దిన్ మే లూట్ లియే..'

– 'హమారా జన్మ భూమీ ఎహీ హై.. క్యాఁ జాయే హమ్ పాకిస్తాన్?'

– 'కుర్సీ సంభాల్నేకే లియే ఏ నాటక్ చలాయే లీడర్స్ హమ్‌కో కట్ వా దియే.. ఇన్సానియత్ భూల్ గయే...' .......



• • •

## గోద్రా ముస్లింల ప్రశ్నలు

– 'సబర్మతి బోగి ప్రీప్లాన్డ్‌గా తగలబెట్టబడిందని అందరూ అంటున్నారు, పత్రికలన్నీ రాశాయి, But by whom?

– 'సబర్మతి సంఘటనను సిబిఐ చేత ఎందుకు విచారణ జరిపించడం లేదు??'

– 'ముస్లింలను, ముస్లింల ఇండ్లనూ, షాపుల్ని, హోటళ్లను వాహనాలను తగలబెట్టడానికి గుజరాత్ అంతటా ఒకే రకమైన కెమికల్ ఎలా సరఫరా అయ్యింది? ఆ కెమికల్‌కి ఎక్కువ సేపు తగలబడే గుణం ఉంది కాబట్టే ముస్లింల శవాలు బూడిద కుప్పలైపోయాయి. బోగి కూడా ఎక్కువసేపు (2 నుంచి 3గంటలు) తగలబడిందంటే అందులోనూ ఆ కెమికల్ వాడబడిందా? అసలా కెమికల్ గుజరాత్ భూకంపంలో చనిపోయిన శవాల్ని (గుట్టలుగా పడేసి) తగలబెట్టడానికి తెప్పించిన కెమికల్ అంటున్నారు. నిజమేనా? అసలు ఒక్కరోజులోనే ఆ కెమికల్ అన్ని ప్రాంతాలకు ఎలా సరఫరా అయింది?'

– 'ఫోరెన్సిక్ రిపోర్ట్స్ ప్రకారం భోగి లోపలినుంచే తగలబెట్టబడిందని చెప్తున్నారు కదా?' – 'ఎముకలు కూడా మిగలకుండా ముస్లింలను తగలబెట్టారు. అలాంటి కేసులన్నింటిని పోలీసులు మిస్సింగ్ అని రాసుకొని చనిపోయిన వాళ్ల సంఖ్యను అతి తక్కువగా చూపుతున్నారు. అసలు గుజరాత్ మొత్తంగా మిస్సింగ్ సంఖ్య ఎంత? ఉదా.కు గోద్రాకు దగ్గర్లోని డెలోల్ గ్రామంలో 37 మందిని ముక్కలుగా నరికి తగలబెట్టారు. అందులో 25 మందిని పోలీసులు మిస్సింగ్ అని రాసుకున్నారు. గోద్రా దగ్గర్లోని మరో ఊరిలో 450 మంది కనిపించడం లేదు. సబర్‌కాంటా జిల్లా కిడియాద్ ఊరివాళ్లను 74 మందిని తగలబెడితే 62 మందిని మిస్సింగ్ అని రాసుకున్నారు. సర్దార్‌పూర్‌లో 33 మందిని తగలబెట్టారు. జాఫ్రీ ఇంట్లో 200 నుంచి 250 మంది దాచుకుంటే చంపబడింది ఎంతమందో లెక్కేలేదు. పత్రికల్లో కేవలం జాఫ్రీ కుటుంబ సభ్యులు 28 మందే చంపబడినట్లు వచ్చింది..'

– 'తిరిగి ఇదే తరహాలో మా మీద దాడులు జరగకుండా ఉండాలంటే మేమేం చెయ్యాలి?'

### 3

గుజరాత్‌లో మొత్తం ముప్పై వేలమంది దాకా ముస్లింలు హత్యలు చేయబడినట్లు అర్థమైంది. వందల సంఖ్యలో స్త్రీలు, అమ్మాయిలు రేప్‌కి గురయ్యారు. వాళ్లలో

చాలా తక్కువ మంది బతికివున్నారు. లక్షల మంది ముస్లింలు అన్నీ కోల్పోయి జఖ్మీ దేహాలు మాత్రమే మిగిలి తిండికీ నీడకూ తల్లడిల్లుతున్నారు. రేపు ఇతర రాష్ట్రాల్లోనూ ముస్లింలకు అట్లాంటి పరిస్థితే ఎదురుకానుందని సంకేతాలు అందుతున్నాయి. మరి ఇట్లాంటి విషమ స్థితిలో సభలో సమావేశాలో సంకలనాలో మాత్రమే రేపటి ప్రమాదాన్ని నివారిస్తాయని అనుకోవడం లేదు.

వాళ్లు బాబ్రీ మస్జిద్ నేల మట్టం చేశారు – మనం నిరసన తెలిపాం. వాళ్లు బొంబాయిలో ముస్లింలను ఊచకోత కోశారు, ఆ విషయాన్ని బట్టబయలు చేసిన జస్టిస్ శ్రీకృష్ణ కమీషన్‌ని బుట్టదాఖలు చేశారు – మనం నిరసన తెలిపాం. వాళ్లు ఇవాళ గుజరాత్ సృష్టించారు – మనం నిరసన తెలుపుతూ ఉన్నాం. వాళ్లు రేపు దేశమంతా గుజరాత్ చేస్తారు – మనం నిరసన తెలుపుతూనే ఉందామా?! ముస్లింలను చంపేవాళ్లు వేరే ఉన్నారు. చంపిస్తున్నవాళ్లు వేరే ఉన్నారు. వాళ్ల దగ్గరికి వెళ్లే ప్రోగ్రాం ఏది మన దగ్గర?? లేనప్పుడు ఇక ముస్లింల ప్రాణాలను ఎవరూ కాపాడలేరు !

• • •

వందేళ్ల రిజర్వేషన్ పండుగలు చేసుకుంటున్న సందర్భంలో ఉన్నాం. గుజరాత్‌లో దళితులు వాడుకోబడ్డారని వాళ్ల తప్పేమి లేదన్నట్లు దళిత నాయకలు మాట్లాడతారు. ఆదివాసీలు వాడుకోబడ్డారని మేధాపాట్కర్ కూడా బాధపడతారు. ఇక బీసీలు – గుజరాత్ ముస్లింల దగ్గర ఎక్కడా మేము బీసీల ప్రస్తావన కూడా తేలేకపోయాం – పటేళ్లు, ఠాకూర్లు, బ్రాహ్మణులతో పాటు దాడులకు అత్యధికంగా నాయకత్వం వహించింది బీసీలే... అందుకని బీసీ లెవరూ మాట్లాడరు. మొత్తానికి వేలమందిని పొట్టనబెట్టుకున్న పాపంలో, లక్షలమందికి అన్నం, నీళ్లు, ఇళ్లూ లేకుండా చేసిన పాపంలో, వేలమంది పసిపిల్లల్ని అనాధల్ని చేసిన పాపంలో మిత్రులనుకున్న వాళ్లందరి చెయ్యే ఉంది. దానికి ప్రతిగా ఇక్కడ ఆయా వర్గాల నాయకుల ప్రోగ్రాం ఏమిటి??

• • •

ఏళ్ల నుంచి వింటున్నాం – 'రాజ్యా'నికి వ్యతిరేకంగా పోరాడుతున్నామంటున్న వివిధ పార్టీల గురించి.. ఇవాళ రాజ్యం ఆరెస్సెస్.. దేశంలోగానీ, గుజరాత్‌లో గానీ..! ఆరెస్సెస్‌ను మోస్తున్న బోయీల పాత్ర నిర్వహిస్తున్న ఎన్డీయే మిత్రపక్షాలు కూడా ఆరెస్సెస్ భావజాలాన్ని మోస్తున్నట్లే కదా.. అట్లాంటప్పుడు మరి రాజ్యానికి వ్యతిరేకంగా పోరాడుతున్నామంటున్న పార్టీలు పోరాడాల్సింది ఆరెస్సెస్‌తో కాదా..?



మరి ఒక్క బహిరంగ ప్రకటనైనా ఆరెస్సెస్‌కు వ్యతిరేకంగా ఇవ్వడానికి ఆయా పార్టీలెందుకు సిద్ధంగా లేవు?? ఆయా పార్టీల్లోని కొన్నింటిలో మహిళా సంఘాలుంటాయి, కుల సంఘాలుంటాయి.. మరి మైనారిటీ సంఘాలెందుకు లేవు?? అణచివేత కన్నా నిర్మూలన ఇంకా తీవ్రమైన సమస్య కాదా?? గుజరాత్ కాంగ్రెస్ పార్టీ హిందువుల ఓట్ల కోసం మౌనంగా ఉన్నట్లే, హిందువుల మద్దతు 'పూర్తిగా(?)' ఎక్కడ కోల్పోతావెూ నని ఆయా పార్టీలు భయపడుతున్నాయనుకోవాలా?? శత్రువు స్పష్టంగా ఉన్నాడు. మిత్రుల స్పష్టత విషయంలోనే అనుమానంగా ఉంది. మిత్రుల నుంచి బహిరంగ ప్రకటనలు కావాలి మాకు !

• • •

మనది లౌకిక దేశమనే ముస్లింలు ఇంకా నమ్ముతున్నారు.. తమకు అన్యాయం జరిగితే మాట్లాడేవాళ్లున్నారనే వాళ్లింకా నమ్ముతున్నారు.. కాని దాడులంటూ జరిగితే అంతా తలుపులు బిగించుకుంటారని, ఎవరూ రారని గుజరాత్ నిరూపించింది. అక్కడి కాంగ్రెస్ పార్టీ, కార్మిక సంఘాలూ, ప్రోగ్రెసివ్ 'మనుషులూ' ఎవరూ దాడుల్ని ఆపలేకపోయారు (దాడులు నిర్వహించినవాళ్లు తమ ప్లాన్ ప్రకారం మూడు నెలలు నిరాటంకంగా వాటిని కొనసాగించారు). ఇక ఎక్కడైనా అంతే జరగదని నమ్మకమేమిటి? ఈ పరిస్థితుల్లో ప్రగతివాదులూ, అభ్యుదయవాదులూ, కమ్యూనిస్టులూ, దళిత బహుజన ఆదివాసీ మేధావులూ మౌనం వీడి తాము ఖచ్చితంగా ఎటు పక్షమో బహిరంగంగా తేల్చి చెప్పాల్సిన తరుణమిది. దాంతోనైనా ముస్లింలకు ఒక స్పష్టమైన దారి కనిపించే అవకాశం ఉంది...

• • •

గొంతు మీద కత్తి
పలకమంటున్న పదాలు
జై శ్రీ రాం
గొంతు తెగి పోతున్నా
లొంగని ధిక్కారమే
రేపటి ఆశ

*2002 'అజాఁ' గుజరాత్ ముస్లిం కవిత్వం సంపాదకీయం*

# 'హిందూత్వ' దాష్టీకాన్ని ప్రశ్నించిన ముస్లింవాద కవిత్వం

ముస్లింల పేదరికం, అభద్రతాభావం, వివక్ష, అణచివేత, హిందూత్వ దాష్టీకం, బాబ్రీ విధ్వంసం, గుజరాత్ ముస్లిం జాతిమేధం, ముస్లిం సంస్కృతి, ముస్లిం స్త్రీలు, దూదేకులు– ఇతర సమూహాల ముస్లింలు, ముస్లిం ఛాందసత్వం తదితర అంశాలపై విస్తృతంగా కవిత్వం, కథలు ఈ రచయితల నుంచి వచ్చాయి. అందులో మెజారిటీ మత భావజాలం వల్ల ముస్లింలు ఎదుర్కొంటున్న వివక్ష, అణచివేతల గురించి వచ్చిన కవిత్వాన్ని ఇక్కడ పరిచయం చేసుకుందాం.

హిందీ హిందూ హిందుస్తాన్
ముస్లిం జావో పాకిస్తాన్
ముసల్మాన్ కే దో హీ స్తాన్
పాకిస్తాన్ యా ఖబ్రస్తాన్ –ఖాదర్ మొహియుద్దీన్

ఇలాంటి ఒక నినాదం రూపొందించి ముస్లింలను శత్రువులుగా, రకరకాలుగా ప్రచారం చేసి, వారిని పాకిస్తాన్‌కు పారద్రోలడమో లేదా చంపివేయడమో చేయాలని ముస్లిమేతరులనందరినీ రెచ్చగొట్టిన హిందూత్వవాదుల చర్యను ఖాదర్ మొహియుద్దీన్ తన దీర్ఘ కవిత 'పుట్టుమచ్చ'లో ప్రశ్నించారు.

పై భావజాలంలో నుంచే వచ్చిన మరొక నినాదం– 'భారతదేశంలో ఉండాలంటే వందేమాతరం పాడాల్సిందే!'

స్వతంత్ర ఇండియాలో మత స్వాతంత్ర్యపు హక్కు ఉంది. వాళ్లకు కొన్ని ఇష్టాయిష్టాలు ఉండొచ్చు. వందేమాతరం చారిత్రక ప్రాముఖ్యత కలిగిన గీతమే అయినా 'పాడాల్సిందే' అనే నియంతృత్వం సరైంది కాదుకదా! ఈ గీతం వెనక కూడా మళ్లీ అదే భావజాలం.. 'ఆనంద్‌మఠ్' నవలలో ముస్లింలను పారద్రోలాలని, లేదంటే చంపివేయాలని ఓ పాత్ర ద్వారా చెప్పిస్తాడు బంకించంద్ర. మరి అటువంటి నవలలోని వందేమాతరం గీతాన్ని పాడాల్సిందే నని ఇప్పుడు బలవంతం చేయడం



సరైంది కాదు. అట్లే ఆ గీతంలో ఇండియాను దుర్గా మాతతో పోల్చడం, తలవంచి నమస్కరించడం ఉంటుంది. ముస్లింలు తాము అల్లా ముందు తప్ప ఇంకెవరి ముందూ తల వంచం అంటున్నారు. అలాంటప్పుడు బలవంతపెట్టడం తగదు.

ఇక మరో నినాదం– 'భారతదేశం అంటే ధర్మసత్రం కాదురా' అనేది. ఇలాంటి దారుణమైన నినాదాలు తయారుచేసి ముస్లింలపై విషం చిమ్ముతూ వస్తున్నది హిందూత్వవాదం. ఇలాంటి నినాదాలు చూసినప్పుడు, విన్నప్పుడు సామాన్య ముస్లింల మనోభావాలు ఎంతగా దెబ్బతిని ఉంటాయో, ఎంతగా వాళ్లు మానసిక హింసకు గురై ఉంటారో ఒక్కసారి ఆలోచించాలి...

వాళ్లూ వాళ్లూ కలిసి పంచుకున్న ఊళ్ల మధ్య
నా రక్తం ఏరులై పారింది

అంటాడు ఖాదర్ మొహియుద్దీన్ (తన తొలి ముస్లింవాద దీర్ఘ కవిత 'పుట్టుమచ్చ'లో). నిజం కాదా! దేశ విభజనతో ఇక్కడి సామాన్య ముస్లింలకు ఏం సంబంధం. పెద్దలమనుకున్న వాళ్లమధ్య తేడాలొచ్చి తీసుకున్న నిర్ణయం ఎంతటి రక్తపాతాన్ని సృష్టించిందో తెలిసిందే! దేశ విభజన నాటి రక్తపాతం ప్రపంచంలోనే మహా విషాదం. పక్కవాడు అనుమానంగా చూస్తున్నా, తరిమివేయాలని చూస్తున్నా, ఉన్న ఊరు– కన్నతల్లిని వదిలి వెళ్లలేక, తమ మూలాల్ని, వేర్లను తెంచుకుని వెళ్లలేక పుట్టిన గడ్డనే హత్తుకుని ఉండిపోయిన ఈ దేశపు ముస్లింలకు ఎంతటి దుర్గతి పట్టించారు ఇక్కడి పాలకులు, హిందుత్వవాదులు. అనుదినం అవమానపరుస్తూ మాతృదేశంలోనే ముస్లింల మనసుల్ని ఛిద్రం చేశారు. చివరికి రోడ్డుసైడు చిల్లర వ్యాపారాలకు మాత్రమే ముస్లింలు పరిమితం అయ్యేలా చేశారు. అలా తమ బతుకు తాము బతుకుతున్నప్పటికీ–

...పార్లమెంటు భవనంలో వాలేందుకు
నా నెత్తురు పాదలేపనమవుతుంది..
నా రక్తం పదవీసోపానానికి
అభయ 'హస్త' మవుతుంది
నా రక్తం 'భరతమాత' నుదుటి
తిలకమవుతుంది, పూజా 'కమల' మవుతుంది

అంటూ మతోన్మాదులు, రాజకీయ పార్టీలు ముస్లింలను ఎలా వాడుకుంటున్నదీ కవిత్వీకరిస్తారు ఖాదర్ మొహియుద్దీన్.

క్రికెట్‌మేచ్ నా దేశభక్తికి / తూనికా, కొలమానమవుతుంది / నేను నా

మాతృదేశాన్ని / ఎంతగా ప్రేమిస్తున్నానన్నది కాదు / ఏయే పరాయి దేశాల్ని ఎంతెంతగా ద్వేషిస్తున్నా నన్నదే / నా దేశభక్తికి ఎంతోకొంత ఆధారమవుతుంది –అంటూ చివరికి క్రికెట్ ఆట కూడా ముస్లింలను అనుమానించడానికి ఒక సాకు కావడాన్ని ఖాదర్ ప్రశ్నించారు.

నేను పుట్టకముందే
దేశద్రోహుల జాబితాలో
నమోదై వుంది నా పేరు

అన్న ఖాదర్ పాదాలతో సాహిత్యలోకం ఉలిక్కిపడిందంటే అతిశయోక్తి కాదు.

'కన్నబిడ్డని సవతి కొడుకుగా / చిత్రించింది చరిత్ర / అన్నదమ్ముల్నించి చీల్చి నన్ను ఒంటరివాణ్ణి చేసింది చరిత్రో అన్న ఖాదర్ వాక్కులు ముమ్మాటికీ నిజం.

ఈ కవితతోనే తెలుగు సాహిత్యంలో ముస్లింల అభివ్యక్తి మొదలైంది. అంతకు ముందు ఇస్మాయిల్, వజీర్ రహమాన్, స్మైల్, కౌముది, దిలావర్, దేవిప్రియ, గౌస్, అఫ్సర్, యాకూబ్ లాంటి కవులున్నప్పటికీ పుట్టుమచ్చకు ముందువాళ్లు తాము ముస్లిం కవులుగా రాసింది లేదు.

బాబ్రీ వివాదాన్ని రెచ్చగొడుతూ హిందూత్వ భావజాలాన్ని పెంచిపోషిస్తూ ముస్లింలపైకి ముస్లిమేతర సమాజాన్ని మొత్తంగా ఉసిగొల్పాలని ఆరెస్సెస్ ఫాసిస్టు శక్తులు పనిగా పెట్టుకున్నాయి. రాజకీయంగా బలపడడానికి రామమందిర నిర్మాణాన్ని ఎత్తుకున్న ఈ శక్తులు అద్వానీ రథయాత్రతో మరింత పెచ్చరిల్లాయి. ఈ సందర్భంలోనే ఒక ముస్లిం కవి హృదయంలో 'పుట్టుమచ్చ' కవిత రూపుదిద్దుకుంది. 1991 లోనే ఈ కవిత అచ్చయింది.

1992లో బాబ్రీ మజీదు కూల్చబడింది. దాంతో దేశం మొత్తంలోని లౌకికవాదులైన ముస్లింలంతా కూడా హతాశులయ్యారు. తాము ముస్లింలమన్న స్పృహలోకి రావలసివచ్చింది. దాంతో అన్నాళ్లు ముస్లింలుగా మాట్లాడని ముస్లిం మేధావులు, కవులు, రచయితలు, ఆలోచనాపరులంతా ముస్లింగా మాట్లాడాల్సిన అవసరాన్ని గుర్తించారు.

తెలుగులోనూ అఫ్సర్, యాకూబ్, ఇక్బాల్‌చంద్, హనీఫ్ లాంటివారంతా ముస్లింలుగా తమ ఫీలింగ్స్ కవిత్వీకరించారు. అదే సందర్భంలో 'కంజిర' బులెటిన్ బాబ్రీ కూల్చివేతను పురస్కరించుకుని ఒక సంచిక వేసింది. అందులో పై కవులున్నారు.

ఈ క్రమంలో తెలుగు సాహిత్యంలో దళిత సాహిత్యం ఊపందుకున్నది. వారి



సాన్నిహిత్యంలో, దళితవాదం అందించిన స్ఫూర్తితో ఖాజా, నల్గొండ దళిత బహుజన కవులు, ముఖ్యంగా సుంకిరెడ్డి నారాయణరెడ్డి ప్రోత్సాహంతో స్కైబాబ ముస్లింవాద కవితలు రాశారు.

1995 జనవరిలో వచ్చిన 'చిక్కనవుతున్నపాట' సంకలనంలో అచ్చయిన ఖాజా, అబ్బాస్, అఫ్సర్, యాకూబ్, ఇక్బాల్‌చంద్ ల ముస్లిం కవితలున్నాయి.

దేశభక్తి గురించి తెలుగు సాహిత్యంలో ఎంతో కవిత్వం వచ్చింది. ముస్లిం కవి తనను అవమానిస్తున్న, అనుమానిస్తున్న మెజారిటీ మత భావజాలమున్న సమాజాన్ని ధైర్యంగా ప్రశ్నించడం 1998 లో వచ్చిన ముస్లింవాద కవితా సంకలనం 'జల్‌జలా' లో చూస్తాం.

ఈ దేశపటాన్ని చుట్టచుట్టి నీ తల కింద పెట్టుకోవడానికి
అది నీ అయ్య జాగీరు కాదు / అంగట్లో దొరికే కుంకుమ కాదు దేశభక్తి

అంటూ నిలదీస్తాడు సయ్యద్ గఫార్.

ఇలా ఎంతోమంది ముస్లిం కవులు మెజారిటీ మత భావజాలాన్ని, మతోన్మాదాన్ని ప్రశ్నించారు. ఈ లోగా 2002 సంవత్సరంలో భారత దేశ చరిత్రలో మొదటిసారిగా జెనోసైడ్ ఒకటి చోటు చేసుకుంది. గోద్రాలో ఓ రైలు డబ్బాను తగులబెట్టారనే నెపంతో వేలమంది ముస్లింల ఊచకోత సాగింది. దానికి బిజెపి, ఆరెస్సెస్, శివసేన, భజరంగ్‌దళ్ తదితర సంఘ్‌పరివార్ శక్తులు నాయకత్వం వహించాయని ఎన్నో పత్రికలు, ఎలక్ట్రానిక్ మీడియా, మేధావులు, ప్రజాస్వామికవాదులు, లౌకికవాదులు తమ వార్తాకథనాలద్వారా, రిపోర్టులద్వారా, పుస్తకాల ద్వారా రికార్డు చేశారు. ఆ నేపథ్యంలో దేశమంతా ఎన్నోరకాల నిరసన వ్యక్తమయ్యింది. తెలుగు సాహిత్యంలోనూ వందలకొలది కవితలు, కథలు, వ్యాసాలు అచ్చయ్యాయి. 'గుజరాత్ గాయం' పేరుతో 200 మందికి పైగా కవుల సంకలనం ఒకటి ప్రచురింపబడింది. అన్వర్, స్కైబాబ సంపాదకత్వంలో 'అజాఁ' పేరుతో ముస్లిం కవుల సంకలనం ఒకటి గుజరాత్ నరమేధంపై వెలువడింది.

ఆ సంకలనానికి ముందుమాట రాస్తూ ప్రముఖ కవి స్మైల్ ఇలా అన్నారు– 'ఈ సంకలనం.. గుండె వుంటే చదవాలి. దిటవు చేసుకు చదవాలి. లేకుండా చదివిన వారికి ఓ గుండె ఏర్పడి స్పందిస్తుంది. వీరి విషాద కవిత్వ నేపథ్యంలో ఒక ఆలోచన ప్రత్యామ్నాయాల, identity ల దిశగా అంకురిస్తుంది. ఆ అంకురం కోసమే... ఈ సంకలనం.'

అన్వర్ తన సంపాదకీయంలో 'దేశపతాకంలోని కాషాయం తెలుపును

ఆక్రమించేస్తోంది' అన్నారు.

36 మంది కవుల కవితలున్న ఈ సంకలనం ఒక జాతి మేధాన్ని ప్రశ్నించిన సంకలనంగా సమీక్షకుల చేత రికార్డు చేయబడింది.

గర్భంతోనున్న ఒక స్త్రీ కడుపుని చీల్చి పిండాన్ని బైటికి తీసి త్రిశూలంతో ఆడించి మంటల్లో వేసిన సంఘటన యావత్ భారతదేశాన్ని కదిలించివేయడం తెలిసిందే. ఆ విషయాన్ని ముస్లిం కవులు హృదయవిదారకంగా కవిత్వీకరించడం చూస్తాం–

మధ్యయుగాల అంధాయుధం అంచున
శాంతి ఆశ్రయం సాక్షిగా కలి ఘనీభవించిన
ఆ ..రక్త కణాన్ని నేనే..నే.. అమ్మా! –సయ్యద్ గఫార్

ఇప్పుడు మాతృగర్భంలోంచే
పెకలించబడ్తున్న మా ఉనికి –వలీహుసేన్

భారత దేశం సెక్యులర్ దేశం అని ప్రపంచమంతా కొనియాడుతుంటే గుజరాత్ నరమేధం మాత్రం ఇక్కడ హిందుత్వ ఫాసిజం రాజ్యమేలుతున్నట్లు స్పష్టం చేసింది. దాంతో మనస్తాపం చెందిన ఓ ముస్లిం కవి ఇలా అంటున్నాడు.

మిత్రులారా!
'కఫన్' కప్పబడిన సెక్యులరిజం జనాజాకు
మీ భుజం ఖాళీ వుంటే పట్టండి –మహమూద్

• • •

*ఒక అందమైన తోట / ఆ తోటలో రకరకాల పూలు*
*రంగురంగుల పూలు గులాబీలు మందారాలు చమేలీలు*
*మొగలిపూలు బంతిపూలు గుల్‌మొహర్‌లు*
*అన్ని రకాల పూలతో చాలా అందంగా కనబడుతుందా తోట*
*అయితే / ఆ పూలన్నింటినీ నలిపేసి, తొక్కేసి, నరికేసి*
*ఒక్క కమలమే విస్తరించాలంటే*
*ఆ తోట అందమంతా ఏమైపోతుంది ?!*

అన్నాడు జల్‌జలా కవి అఫ్రీన్. ఇప్పుడు దేశంలో అదే జరుగుతుంది. భిన్న కులాల భిన్న భాషల, భిన్న సంస్కృతుల, భిన్న మతాల వారిని సంహరించి ఒక్క 'హిందుత్వ' మతోన్మాదులే ఈ దేశంలో మిగలాలని కలలు కంటున్నారు. అందుకు నిదర్శనం గుజరాత్ ముస్లిం జాతి హత్యాకాండ.



'గుజరాత్' అంటే ఒక ముస్లిం స్త్రీ గర్భంలో త్రిశూలం గుచ్చి కడుపులో ఉన్న శిశువుని బైటికి లాగి త్రిశూలం మొనపై ఆడించి మంటల్లోకి విసిరిన పైశాచికత్వం!

గుజరాత్ అంటే ఐదారేళ్ల పసివాడికి పెట్రోల్ తాగిచి ఆ లేత పెదాలపై అగ్గిపుల్ల అంటిస్తే ఆ చిన్నారి దేహం ఫట్ మని పేలిపోయిన అమానవీయ దృశ్యం !

తల్లుల ముందే పిల్లల్ని పిలల్ల ముందే తల్లుల్ని సామూహికంగా చెరిచి ముక్కలుగా నరికి తగలబెట్టిన వైనం !

పాడుబడిన బావిలోకి మనుషుల్ని విసిరేసి పై నుంచి రాళ్లెత్తేయడం...

ప్రాణ భయంతో పారిపోతున్న 70 మందిని టెంపోలోనే సజీవ దహనం చేయడం...

తన తల్లిని తగలబెడుతున్న దృశ్యం కళ్లల్లోకి ప్రసరించిన ప్రతిసారీ ఏడేళ్ల ఇమ్రాన్ పెడుతున్న కేక...

పూడ్చుకోవడానికి కూడా మిగలని వందలూ వేల బూడిద కుప్పలు !

'భార్యల కనురెప్ప మీదే భర్తల దహనం.. భర్తల పిచ్చి పూచుల ముందే బరిసెలు దిగబడిన యోనుల రక్తం కేకలు.. యోనుల రక్తస్రావంలో మునిగిపోతున్న నా దేశం'..

• • •

*రామబాణంతో వాళ్ళు / విష్ణు చక్రంతో / కృష్ణ చక్రంతో వాళ్ళు / శివుని త్రిశూలంతో వాళ్ళు / హనుమంతుని గదతో వాళ్ళు... / అయ్ అల్లాహ్ !*
*ఈ చేతులు ఉట్టి దువాకేనా ?!* –స్కైబాబ

ఐదు నుంచి 10 వేల మంది దాకా గుంపుగా కత్తులు, త్రిశూలాలు, పిస్తోళ్లు, యాసిడ్ పట్టుకొని ఒక్కొక్క ఊరిలో ఉన్న ముస్లిం బస్తీల మీద పడి చంపుతుంటే పారిపోయిన ముస్లింలు చెట్లనకా, పుట్టలనకా, గుట్టలనకా, పగలనకా, రాత్రనకా కిలోమీటర్ల కొద్దీ పరుగులు పెట్టారు.

పసి దాహాలకు గుక్కెడు నీళ్లు నిరాకరించబడిన సంఘంలో ఒకరి మూత్రాన్ని మరొకరికి తాపించుకున్న నిస్సహాయత.. పసి ఆకలికి నాలుగు మెతుకులు దొరక్కుండా చేసిన రాజ్యంలో పుట్టమన్నులో నీళ్లు కలిపి తినిపించుకున్న నిస్సహాయత..

అంతేకాక ఆకులు అలములు తిని బతికీ చెడీ తిరిగి ఊర్లలోకి వద్దామంటే

ఆరెస్సెస్ గుండాలు రకరకాల షరతులు విధిస్తే బిత్తరపోయిన ముస్లింలు ఊరిబైటే ఉండిపోయారు. ఆ షరతుల్లో ఒకటి 'అజాం' వినిపించకూడదని ! ఆంధ్రప్రదేశ్ తెలుగు ముస్లిం కవుల గుజరాత్ కవిత్వాన్ని అందుకే 'అజాం' పేరుతో సంకలనం చేశాం. దీనిని అన్వర్, నేను సంపాదకులుగా ఎంతో శ్రమకోర్చి తీసుకొచ్చాం.

దళిత వాడలు ఊర్లలో కలుస్తున్న ఆనందం

ఒళ్లంతా పారక ముందే / ఇప్పుడక్కడ ఊరి బైట ముస్లిం వాడలు వెలిశాయి

30 వేల మంది ముస్లింలు హత్యలు చేయబడితే ఆ సంఖ్య కేవలం 11 వందలుగా చూపెట్టడం.. ఇంతలోనే ఆ సంఖ్యను అందరం ఒప్పేసుకోవడం ఆశ్చర్యంగా ఉంది. ఇప్పటికైనా ఎప్పటికైనా గుజరాత్‌లో అసలు ఎంతమందిని చంపేశారో ఎన్ని లక్షల ఇండ్లను నేలమట్టం చేశారో ఎందరు స్త్రీలను రేప్ చేశారో, ఎందరు అమ్మాయిల్ని ఎత్తుకుపోయారో.. ఎంతమంది పసిపిల్లల్ని అనాథల్ని చేశారో తేల్చాల్సి ఉంటుంది..

ఇప్పుడీ దేశాన్ని ఏ జీవజలంతో కడిగినా పోని రక్తపు వాసన

కాళ్ల కింది నేలే కాదు / కరిగిన ఆకాశం కూడా మురికైపోయింది

అంటాడు ఖాదర్ షరీఫ్.

దేశ విభజనలో లక్షల మందిని బలిచ్చుకున్నాం.. అదో పెను విషాదమైనా.. మనసులకి సర్ది చెప్పుకున్నాం. కాని ఇప్పుడు ఈ గుజరాత్ రక్తపు తడి ఎన్నటికీ మా మనస్సుల్లోంచి ఆరిపోదు... ఈ గుజరాత్‌లో లేచిన నల్లటి పొగ ఎన్నటికీ మా కళ్లల్లోంచి మాయమవదు.. చూస్తూ ఉండిపోయిన, అప్పుడే మరిచి పోయిన ఎందరి మీదో అసహ్యంగా ఉంది. ...

...గుడ్డల్ని చీరి పీలికలు చేసినట్టు / మా దేహాల్ని చీల్చేస్తుంటే...

ఎక్కడికని పరిగెత్తను ? / ఏ రాతి గుహల్లో దాక్కోను ?

అంటూ షాజహానా రాతి యుగంనాటి అనాగరికతకు ఆనవాళ్లుగా హిందుత్వవాదులను పోలుస్తుంది.

'కాలీ దునియాఁ' అనే మరో కవితలో స్త్రీగా తాను గుజరాత్ మారణహోమాన్ని, ముఖ్యంగా ముస్లిం స్త్రీలపై జరిగిన అత్యాచారాల్ని ప్రశ్నిస్తూ షాజహానా ఇలా అంటుంది–

...నీ ఇంట్లో ఆడది కూడా / రహస్యంగా మా కోసం కన్నీళ్లు కార్చి ఉంటుంది! మగ నాకొడుకుల ఊపిరి / బయటికి రాకుండా నొక్కేస్తే / పీడా పోతుందని ఒక్కసారైనా మీ అమ్మ అనుకునే ఉండాలి / సృష్టికి ఒక్కరే తల్లీ తండ్రీ అని



నమ్ముతున్న దాన్ని

నీకు నాకు మధ్యా రక్త సంబంధం లేదంటావా? / గుండెల్ని పెకిలించి / పొట్టలు చీల్చి / యోనుల్లో ఆయుధాలు పొడిచి / ఇవ్వాళ నువ్వు చావుల విందు చేసుకొనుండొచ్చు / కానీ 'నన్ను' హత్య చేయలేవు / అనంతంగా సాగే జీవనదిని నేను బతకడమే కాదు / నిన్ను పుట్టించి బతికించేది నేనే...! / అయినా / స్త్రీ తప్ప మగాణ్ణి క్షమించేదెవరు? / ఎప్పటికీ ప్రపంచం / నా రొమ్ము తాగుతున్న పసిబిడ్డే...!

–ఈ కవిత మనసున్న, మానవత్వమున్న ఎవరినైనా కదిలిస్తుంది. కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంది. ...

•••

హమ్ మర్కే భి జగాతే హై

సోయీ హుయీ దునియా కో

అంటాడు అలీ.. నిజమే! 30 వేల మంది ముస్లింలు హత్య చేయబడితే గాని భారతదేశం ఉలిక్కిపడలేదు! ఆ ఏమవుతుందిలే, ఏం చేస్తారులే అని హాయిగా కునుకుదీస్తున్న మన లౌకిక వాదులూ, ప్రగతిశీలురూ, ప్రజాస్వామ్యవాదులూ, మార్క్సిస్టులు, మావోయిస్టులూ అంతా దిగ్గున లేచి కూర్చున్నారు. 30 వేల మంది ముస్లింల బలిదానం జరిగితేగాని ఈ దేశంలో ఆరెస్సెస్ ఏం చేయబోతోందో అర్థం కాలేదు. అట్లా తాము చచ్చిపోయి కూడా అందరినీ మేల్కొల్పుతున్నాం అంటున్నాడు అలీ అందరూ మేల్కొన్నట్లు అనిపించింది. కాని ఆరెస్సెస్‌ను నిలువరించే, కనీసం అది చేసే దుష్ట చర్యల్ని నిలువరించే కార్యక్రమాన్ని కూడా ఎవరూ చేపట్టలేదు. ఊరకే ఉపన్యాసాల్లో హిందూ మతోన్మాదానికి వ్యతిరేకంగా పోరాడుతాం అంటే సరిపోతుందా? కొన్ని సభలు చేస్తే పుస్తకాలేస్తే మన బాధ్యత నెరవేరినట్టేనా? ఇక్కడ ఒక అనకూడని మాట కూడా అనాలనిపిస్తోంది– జర్మనీ తత్వవేత్త ఫాస్టర్ నీమెల్లర్ అన్నట్లు ..వాళ్లు క్యాథలిక్కుల కోసం వచ్చారు/ నేను క్యాథలిక్కును కాదు గనుక మాట్లాడలేదు... అన్న చందంగా ఆరెస్సెస్ వాళ్లు వచ్చింది, వస్తున్నది ముస్లింల కోసం కాబట్టి ఎవరూ అంతగా పట్టించుకోవడం లేదా?

కొన్ని పదుల సంవత్సరాలుగా ఆరెస్సెస్ గట్టి పథకంతో దేశంలోని జనాన్నంతా హిందువైజ్ చేస్తూ వస్తున్నది. ముందుగా బీసీల్ని చాలా వరకు హిందువైజ్ చేసేశాక(?) ప్రస్తుతం దళితులు, ఆదివాసుల మీద దృష్టి నిలిపింది. అందులో

భాగంగానే ఆదివాసీ ప్రాంతాలలో యోగేశ్వర పరివార్, గాయత్రి పరివార్, సద్విచార్ పరివార్ స్వామీ నారాయణ సాంప్రదాయి,... లాంటి పేర్లతో పని చేస్తూ ఉంది. ఇలాంటి సంస్థలే గుజరాత్‌లో ఆదివాసీల్ని ముస్లింలపైకి ఉసిగొల్పాయి. రాజస్థాన్‌లోనూ, ఒరిస్సాలోనూ పని చేస్తున్నాయి. ఒరిస్సాలో ప్రతి గిరిజనుడి ఇంట్లో ఒక త్రిశూలం ఉంది. రాజస్థాన్‌లో, ఢిల్లీలో, ఉత్తర ప్రదేశ్‌లోనూ లక్షల త్రిశూలాలు పంచారు. అవన్నీ ఎవర్ని గురి చూసేందుకు? తెలిసి కూడా మనం మౌనంగానే ఉందామా? ఈ విషయాలన్నీ 'ముల్కి' ముస్లిం సాహిత్య ప్రత్యేక సంచికలో రికార్డు చేయబడ్డాయి.

పాఠశాలలు లేని అటవీ గ్రాల్లో సైతం ఏకోపాధాయి పాఠశాలల పేరుతో ఆరెస్సెస్ పాఠశాలలు నడుపుతోందని తెలుస్తున్నది సరస్వతీ శిశుమందిర్‌ల గురించి ప్రత్యేకంగా చెప్పాలా? ఇంకా శారదా విద్యామందిర్, గాయత్రీ వగైరా ఎన్నో పేర్లతో నడుస్తున్నాయనీ కూడా హిందుత్వనే బోధిస్తున్నాయి. ఇప్పటికే అన్ని ప్రభుత్వ సంస్థల్లో, పోలీసుల్లో, ఆర్మీలో ఆరెస్సెస్ బలం ఉన్నవాళ్లు నిండిపోతున్నారు. (గుజరాత్‌లోనైతే పోలీసుల శాఖంతా దాదాపుగా ఆరెస్సెస్‌తో నిండిపోయిందని తెలిసిందే)

ఎంతో కొంత చైతన్యవంతులైనవాళ్లు బతుకుదెరువు కొరకు ఊళ్లొదలి పట్నాలకు వలస వెళ్తుంటే ఆరెస్సెస్ అదే పనిగా జీతమిచ్చి ఒక ఫుల్‌టైమర్‌ను ఊర్లలోకి పంపుతున్నది. వాళ్లు మెల్లగా ఊర్లలో చేరి పొద్దున్నే వ్యాయామం పేరు చెప్పి ఊరిబైటి ఏదేని గుడి దగ్గరికి తీసుకెళ్లి కాసేపు ఎక్సర్‌సైజులు చేయించి తర్వాత హిందుత్వ బోధన చేస్తున్నారు. 'హిందువునని గర్వించు- హిందువుగా జీవించు' అనే వాక్యం కొన్ని రోజులకే ఊరి గోడలపై రాయించబడుతుంది. దాంతోపాటు ఆరెస్సెస్ పత్రికలు జాగృతి లాంటివి, ఇంకా ఇతర హిందుత్వ భావజాలం ఉన్న పుస్తకాలు చదివిస్తున్నారు. దాంతో ఆ యువకులంతా ముస్లింలు ఈ దేశస్తులు కారని, దేశద్రోహులని, ఐఎస్ఐ ఏజెంట్లనీ నమ్మడం మొదలవుతున్నది.

ఇంకా ఊర్లలో కూడ వినాయకులను నిలబెట్టించడం, 'హిందూ దేవాలయాలకు మాత్రమే ప్రాధాన్యతనివ్వడం జరుగుతున్నది. వినాయకుల విషయంలో సక్సెస్ అయిన హిందుత్వవాదులు ప్రస్తుతం దసరాకు దుర్గను కూడ నిలపడం పట్నాలలో షురూ చేశారు.

ఇంకా ఎన్నో మార్గాల ద్వారా హిందుత్వను పెంచుతూ చివరికి దళితులను, ఆదివాసీలను సైతం హిందువైజ్ చేయడంలో సక్సెస్ అవుతున్న ఆరెస్సెస్ శక్తులు



ప్రతి ఎన్నికల్ని, ప్రతి అంశాన్ని ప్రయోగంగా చూస్తూ ముందుకు పోతున్నాయి. ఇవాళ దేశంలోనూ, మహారాష్ట్రలోనూ కలిపోయిందని సంతోషించి సబరపడితే లాభంలేదు. వాళ్లు వీటిని కూడా రేపటి తమ విజయానికి సోపానంగా మల్చుకుంటూనే ఉంటారు. వాళ్ల గ్రౌండ్‌వర్క్ నడుస్తూనే ఉంది కాబట్టి ఎప్పటికైనా వాళ్లు గెలిచే అవకాశం ఉంది.

ఆరెస్సెస్‌ను నిలువరించే మార్గం ఒక్కటే కనిపిస్తున్నది. ఎవరినైతే హిందువైజ్ చేస్తూ మెజారిటీలమని బుకాయిస్తూ వస్తున్నారో వాళ్లను హిందువైజ్ కాకుండా ఆపడం, ఆదివాసులు, దళితులు, బీసీల వారిని హిందువులం కామన్న ఎరుకలోకి తీసుకురావడం.

రాముడు, కృష్ణుడు, వినాయకుడు తదితర మగ దేవుళ్లంతా తమ దేవుళ్లు కారనీ, తమది మాతృస్వామ్య వ్యవస్థ అనీ, తమది అమ్మ దేవతల సంస్కృతి అనీ గుర్తు చేయడం. ఎల్లమ్మ, మైసమ్మ, పోలేరమ్మ తదితర అమ్మదేవతల్ని కొలవడం ఆత్మన్యూనతలో పడిపోయి, అంతా మగదేవుళ్లను కొలిచే మాయలో పడిపోయిన విషయాల్ని విప్పడం. తమ సంస్కృతుల్ని, తమ పండగల్ని, తమ ఆచారాల్ని, వ్యవహారాల్ని, గొప్పగా తదుముకునేలా చేయడం.. బతుకమ్మలు, బోనాలు మొదలైన పండుగల్ని హైలెట్ చేయడం.. రాక్షసులని చెబుతున్న వాళ్లంతా తమ దళిత నాయకులనీ, తిరుగుబాటుదారులనీ విడమర్చి చెప్పడం..

ఇవన్నీకాక, ఈ కులవ్యవస్థలో ఉండడం ఇష్టంలేని వాళ్లను స్వేచ్ఛగా బౌద్ధం, క్రైస్తవం, ఇస్లాం తీసుకునే స్వేచ్ఛ ఉందనే జ్ఞానాన్నివ్వడం.. ముఖ్యంగా చైతన్యాన్ని అందించడం..

*(ఈ వ్యాసంలో సగం) '2004 సంస్కృతి' పత్రిక*
*మార్చి 2007 సాహిత్య నేత్రం*
*2007 ప్రాణహిత.ఆర్గ్*
*2007 ఏపి హిస్టరీ కాంగ్రెస్ సంకలనం*
*'సింగిడి' ముస్లిం ప్రత్యేక సంచిక*

## పెద్దగుట్ట దర్గా-అలైబలై సంస్కృతి

# తెలంగాణ ముషాయిరా

పెద్దగుట్ట.. షాదుల్లా బాబా దర్గా! ఎంత ఇంట్రస్టింగ్ స్టోరీ! మనకు రామదాసు గురించి తెలుసు. అలాంటిదే కానీ అందుకు భిన్నమైన ఈ చారిత్రక కథ ఎందుకు తెలీదు?

తెలియకపోవడం వెనుక - అర్థం చేసుకోవాల్సింది ఎంతో వుంది. తానీషాల కాలంలో రామదాసు భద్రాచలంలో ప్రజల నుంచి వసూలు చేసిన కప్పం రాజుకు అప్పజెప్పకుండా రామాలయం కట్టించాడు. అందుకు జైలుశిక్ష అనుభవించాడు. మరి పెద్దగుట్ట ఏరియాలో నిజాంల కాలంలో షాదుల్లా అనే మహానుభావుడు వసూలైన కప్పం కూడా రాజుకు అప్పజెప్పకుండా కష్టాల్లో ఉన్న పేదలకే పంచిపెట్టాడు. వసూలు చేయడం దాటవేశాడు. దాంతో రాజుకు కోపం వచ్చింది. ఒక్కరిని ఇలా వదిలిపెడితే అందరూ రక రకాల కారణాలు చెప్పి ఇలా ఏదో ఒకటి చేసే అవకాశం ఉందని షాదుల్లాను పట్టుకురమ్మని సైనికులను పంపించాడు. షాదుల్లాకు సైనికులకు మధ్య యుద్ధమే జరిగింది. బహుషా షాదుల్లాను వాళ్ళు చంపి ఉంటారు! కాని ప్రచారంలో ఉన్న కథ మాత్రం - సైనికులతో షాదుల్లా ఒక కర్రతో యుద్ధం చేశాడని, చివరికి ఆ కర్రను భూమి మీద కొట్టడంతో భూమి రెండుగా చీలిందని, అందులోకి దూకి మాయమయ్యాడని చెబుతుంది. జానపద కథల్లో హీరో గానీ హీరోయిన్ గాని చనిపోవడం ఉండదు. అలాంటి పరిస్థితే వస్తే వాళ్లు మాయమయ్యారని చెబుతారే తప్ప చనిపోయారనో, చంపబడ్డారనో చెప్పడానికి జానపదులు ఇష్టపడరు. (ఉదాహరణకు సమ్మక్క సారక్క) బహుశా షాదుల్లా విషయంలోనూ అదే జరిగింది. షాదుల్లా మీద ఇలాగే కొన్ని కథలు ప్రచారంలోకి వచ్చాయి. కాకపోతే పెద్దగుట్ట మీద షాదుల్లా మజార్ (సమాధి) ఉంది. దాని పక్కన కొంచెం ఎడంగా ఆయనకు పాలు పోసే సాలవ్వ సమాధి కూడా ఉంది. కాని విషాదం ఏమంటే - అంత పెద్ద గుట్ట ఎక్కి షాదుల్లాను దర్శనం చేసుకున్నాక - అక్కడ వసతులేమీ లేకపోవడం బాధేస్తుంది. అది పెద్దగా జనం రాని పుణ్య



క్షేత్రమా అంటే అదీ కాదు. ఆ చుట్టుపక్కల నుండి, పక్కనే ఉన్న కర్ణాటక ప్రాంతం నుంచీ పెళ్లయిన ప్రతీ జంట షాదుల్లా ఆశీస్సుల కోసం దర్గాను దర్శనం చేసుకుంటుంది. పెళ్లి కాని అమ్మాయిలు పెళ్లి కావాలని మొక్కుకుంటానికి వస్తుంటారు. రాత్రిళ్లు వచ్చి అక్కడ నిద్ర చేస్తారు. చుట్టుపక్కల చాలా దూరాల నుంచి తమ కోర్కెలు తీరుతాయో లేదో తెలుసుకోవడానికి ఎంతో మంది వచ్చి అక్కడ నిద్ర చేస్తారు. రాత్రి కలలో కనిపించి షాదుల్లా బాబా తాము అనుకున్న పని అవుతుందో కాదో, లేదా ఇంకా ఏదో ఒక విషయం చెబుతాడు. ఆ పని కాదనుకుంటే అసలు షాదుల్లా బాబా కలలోకే రాడు అని వారందరి నమ్మకం.

శుక్రవారం న్యాజ్ (కందూరు) చేయడానికి ఎన్నో బృందాలు అక్కడికి వస్తుంటాయి. ప్రతి సంవత్సరం అక్కడ పెద్ద ఎత్తున ఉర్సు (జాతర) సాగుతుంది. వెరసి మొత్తంగా ప్రతి ఏడాది వక్ఫ్ బోర్డు పాడే పాటలో ప్రస్తుతం కోటి నలభైరెండు లక్షలకు ఎవరో ఒకరు దర్గా రాబడిని పాడుకుంటారు. అంటే కోటి నలభైరెండు లక్షలు వక్ఫ్‌బోర్డుకు చెల్లించి ఆపైన వచ్చే ఆదాయాన్ని పాడినవారు ఉంచుకుంటున్నారంటే ఎంత ఆదాయమొస్తుందో ఊహించుకోవచ్చు. అంత డబ్బు ఆదాయంగా వచ్చినప్పటికీ షాదుల్లా బాబా దర్గా పరిసరాల్లో వసతులేమీ లేవు. మంచి నీళ్లు కూడా కొనుక్కొని తాగాల్సిందే. గుట్ట మీద ఒక్కటంటె ఒక్క సిమెంట్ కప్పు లేదు. దర్గాకు కూడా పైన కప్పు లేదు. రేకులు ఉన్నాయి.. ఇదేమి చిత్రం! ఇదంతా మాకు ఎలా తెలిసిందంటే.. ఏప్రిల్ 18వ తారీకున నిజామాబాద్ జిల్లా పెద్దగుట్ట (బడా పహాడ్)లో ఉర్దూ - తెలుగు ముస్లిం కవులతో 'తెలంగాణ ముషాయిరా'కు వెళ్లాం. గుట్ట పరిసరంలో ఓ పెద్ద టెంటు వేసి ముషాయిరా జరిపారు నిర్వాహకులు సీహెచ్ మధు, నరహరి, మామిళ్ల సాయిరెడ్డి తదితరులు. నాళేశ్వరం శంకరం, స్కైబాబ కలిసి హైదరాబాద్ నుంచి ప్రత్యేక వాహనంలో ఉర్దూ - తెలుగు కవుల్ని తీసుకెళ్లారు. బహుశా తెలంగాణ చరిత్రలో తెలంగాణ ముషాయిరా జరగడం ఇదే మొదలు కావచ్చు. ఉర్దూ కవులు వేరే లోకంగా ఉండడం, వారితో తెలుగువారికి ఏమీ సంబంధాలు లేకపోవడం తెలిసిందే. వారిని కలుపుకొని తెలుగు ముస్లిం కవులతో ముషాయిరా జరగడం, అదీ ఒక దర్గా దగ్గర జరగడం విశేషం. ఎందుకంటే - ఈ మధ్య కాలంలో దర్గా సంస్కృతిపై నీలినీడలు

అలుముకుంటున్నాయి. హిందూత్వవాదం చాపకింద నీరులా పెరుగుతుండడం తో దర్గాల దగ్గరికి వచ్చే కొందరు హిందువులు తగ్గిపోతున్నారు. అట్లే ముస్లిం లకు సంబంధించి కొన్ని మత సంస్థలు (జమాత్‌లు) దర్గాల దగ్గరికి పోవడం సరైంది కాదంటూ ప్రచారం చేస్తుండడంతో కొందరు ముస్లింలు కూడా వెళ్లడంలేదు. దీనివల్ల దర్గాలకు వెళ్లే హిందూ – ముస్లింల కలగలుపు సంస్కృతి తగ్గిపొయ్యే ప్రమాదం ఏర్పడింది. దర్గాలు ఈ దేశంలో హిందూ – ముస్లింల మత సామరస్యానికి ఒక ప్రతీకగా నిలిచి ఉన్నాయి. ఈ సంస్కృతిని కాపాడుకోవాల్సిన అవసరముంది. ముందు ముందు దర్గాల దగ్గర సభలు, సమావేశాలు జరుపుకోవాలని 'హర్యాలి' ముస్లిం రచయితల వేదిక గతంలోనే ఒక నిర్ణయం తీసుకొని ఉంది. స్కైబాబ సంపాదకత్వంలో తీసుకువచ్చిన 'అలావా' ముస్లిం సంస్కృతి కవితా సంకలనంలోనూ దర్గా సంస్కృతికి సంబంధించి చాలా కవితలున్నాయి. అందుకే పెద్దగుట్ట దర్గా దగ్గర ఈ ముషాయిరా జరగడం విశేషమే.

ఇదొక చారిత్రక ముషాయిరా అని వక్తలు మళ్లీ మళ్లీ పేర్కొన్నారు. వెళ్లినవారిలో మగ్దూం మొహియుద్దీన్ కొడుకు నుస్రత్ మొహియుద్దీన్ ఉండడం విశేషం. ఉర్దూ కవి అయిన నుస్రత్ ఈ ముషాయిరాలో ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. ఆయన్ను చూస్తుంటే మగ్దూంను చూస్తున్నట్లే ఉందని ఫీలయ్యారు నిర్వాహకులు, సభికులు. అలాగే హైదరాబాదీ ఫేమస్ పెయింటర్ సయ్యద్ బిన్ మొహమ్మద్ కుమార్తె జమీలా నిషాత్ పాల్గొనడం మరొక విశేషం. ఆమె జాతీయంగా, అంతర్జాతీయంగా ఉర్దూలో ప్రముఖ కవయిత్రి. వీరిద్దరితోపాటు స్కైబాబ, నిసార్, అలీ, మాజీద్, అహ్మద్ పాషా, సిరిసిల్ల గఫూర్ శిక్షక్ తదితర ఉర్దూ – తెలుగు ముస్లిం కవులు పాల్గొన్నారు. అట్లే నాళేశ్వరం శంకరం, సీహెచ్ మధుతో పాటు దేవకీదేవి, కందుకూరి శ్రీరాములు, సీహెచ్ ప్రకాశ్, సూరారం శంకర్, జనజ్వాల తదితర తెలుగు కవులు పాల్గొన్నారు. ఇంకా చాలామంది తీవ్రమైన ఎండ కారణంగా రాలేదు. ముషాయిరాలో జమీలా నిషాత్ దక్కనీ తరహా కవితను గానం చేశారు. దానిపై సభికులు ఎంతో ఫిదా అయ్యారు. బగార అన్నం, యాట కూరతో మధ్యాహ్నం దావత్ అదిరింది. ముషాయిరా ముగిశాక అందరం పెద్దగుట్ట ఎక్కడానికి వెళ్లాం. కొందరు కింద ఆగిపోగా ఎక్కువమందిమి ఆడుతూ పాడుతూ గుట్ట ఎక్కాం. పైన చెప్పుకొన్న విషయా



లన్నీ తెలిశాయి. చీకటి పడుతుంటే గుట్ట దిగుతుంటే నిద్ర చేయడానికి ఎంతో మంది గుట్ట ఎక్కుతూ కనిపించారు. ఒక పది, పదిహేను మంది సెల్వార్ ఖమీజ్‌లు ధరించిన ముస్లిం అమ్మాయిల గుంపు ఒకటి టార్చ్‌లైట్లు పట్టుకొని పైకి ఎక్కుతుండడం కనులవిందు చేసింది.

విషాదం ఏమంటే – గుట్ట పైకి మెట్ల దారిలో అటువైపు ఇటువైపు చిన్న చిన్న గుడిసెలు.. అందులో ఉన్న మనుషులు.. ఎక్కువ గుడిసెల్లో ఒక్కొక్కరే ఉండడం ఆశ్చర్యం వేసింది. పరిస్థితిని అర్థం చేసుకుంటే ఎక్కడలేని బాధేసింది. చాలా గుడిసెల్లో ఏ ఆధారమూ లేని ముసలివాళ్లు. తమ బిడ్డలు పోషించలేక వదిలేస్తే అక్కడ పడి ఉన్నవాళ్లు, ఏదో ఒక రోగంతో బతుకీడుస్తున్నవాళ్లు గుడిసెల బయట కూర్చుని అడుక్కుంటున్నారు. కొందరు అలా పడుకోబెట్టి ఉన్నారు. దిక్కులేని వారికి దేవుడే దిక్కు అంటే ఇదే కావచ్చు.. వారి దీనమైన ముఖాలు.. వారి ఒంటరితనం.. లోకుల బాధ్యతారాహిత్యం.. ఆ కొద్ది సమయంలో ఏం చేయాలో తెలియని.. గుండెల్ని పిండేసే బాధ మనసుల్లోకి ప్రవేశించి అలాగే మస్తిష్కాలపై గూడు కట్టుకొని నిలిచిపోయింది!

# మరి ముస్లింలు ఎవరు?

కన్నబిడ్డని సవతి కొడుకుగా / చిత్రించింది చరిత్ర
అన్నదమ్ముల్నించి చీల్చి / నన్ను ఒంటరివాణ్ణి చేసింది చరిత్ర...'
- ఖాదర్ మొహియుద్దీన్

మన దేశంలో 15 నుంచి 20 కోట్లమంది ముస్లింలమున్నాం. ఆంధ్రప్రదేశ్‌లో 90 లక్షలదాకా ఉన్నాం. ఇంత పెద్ద సమూహం ఇవాళ భయంకరమైన సాంఘిక వివక్షకు, దుర్భర దారిద్ర్యానికి, అత్యంత నిరాదరణకూ, నిరక్ష్యరాస్యతకూ గురవుతూ వస్తున్నది. అన్నిరంగాల్లో అట్టడుగునపడి కొట్టుమిట్టాడుతున్నది. ఇవాళ 70 శాతం ముస్లింలు దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నారని, వీళ్లలో 18 శాతంమంది మాత్రమే 'అక్షరాస్యుల'నీ, ఆడవాళ్లు మరీ 4 శాతమేననీ, అన్నిరంగాల్లో రెండు, మూడు శాతమో, అంతకన్నా తక్కువో ఉన్నారనీ, ఎస్సీ,ఎస్టీల కన్నా, ఇతర మైనారిటీలకన్నా వెనకబడి ఉన్నారనీ ఎన్నో నివేదికలు చెబుతున్నాయి.

మాకు చదువుల్లేవు.. ఉద్యోగాల్లేవు.. పదవుల్లేవు.. పరిశ్రమల్లేవు. మాకు భూముల్లేవు. ముఖ్యంగా 90 శాతం మందికి ఏ వృత్తులూ లేవు. ఇన్నాళ్లు బిజెపి, ఆరెస్సెస్‌వాళ్లు మమ్మల్ని భారతీయులు కాదంటూ ప్రచారం చేశారు, ముస్లింలకు రిజర్వేషన్లు ప్రకటించిన సందర్భంలో కొంతమంది బీసీలు మేం బీసీలు ఎట్లవుతామన్నారు. మరి మేం ఎవరం?

మేం ఈ దేశ మూలవాసులం!

శతాబ్దాల నాడు ఈ దేశంలోని మూలవాసులైన ద్రావిడులమీద ఆధిపత్యం సంపాదించిన ఆర్యులు (బ్రాహ్మణులు, కొన్ని అగ్రకులాలవాళ్లు) ద్రావిడుల్నంతా అంటరానివాళ్లని చేసి పారేశారు. ముడ్డికి తాటాకు కట్టి మీ అడుగుల గుర్తులు కూడా కనబడొద్దన్నారు. మూతికి ముంత కట్టి మీ ఉమ్మి కూడా నేలమీద పడొద్దన్నారు. ఊరికీ, కాటికీ, ఆఖరికి మంచి నీళ్లకూ దూరం చేశారు. వాళ్లొస్తుంటే చెప్పులు విడిచి చేత పట్టుకొని పక్కకు నిలబడాలి. తలకు రుమాల ఉంటే తీసిపట్టుకోవాలి. బడికీ, గుడికీ కూడా అంటరానివాళ్లను చేశారు. అలాంటి ఎన్నో అవమానాలు, హింస అనుభవిస్తూ వచ్చిన ఎంతో కాలానికి సూఫీ ప్రవక్తలు వచ్చి మమ్మల్ని అక్కున చేర్చుకున్నారు. వాడు అసుంట అసుంట అంటే సూఫీలు మాకు అలాయిబలాయి ఇచ్చారు. మా గుండెకు గుండెను కలిపారు. మేము తాగిన గిలాసుల్లో వాళ్లు నీళ్లు తాగారు. మాతోపాటు కూచొని బువ్వ తిన్నారు. అగ్రహారాల వీధుల నుంచి మా శవాల్ని కూడా తీసుకెళ్లనివ్వని దుష్ట సంస్కృతిని బద్దలు చేస్తూ మా వాళ్ళ శవానికి వాళ్లు భుజం పట్టారు. మేం మజీదుకు వెళ్తే భుజం భుజం కలిపి నమాజు చదివించారు. మా గుండెలు చెరువులయ్యాయి.. మా మనసులు సముద్రాలయ్యాయి.. మేం మా దేహాలతో కాదు, గుండెలతోనే వాళ్లను అలాయిబలాయి తీసుకున్నాం. మేం వాళ్లలో ఒకరమైనాం. మాకు కష్టమొస్తే, నష్టమొస్తే వాళ్లు మంచి మాటల్తో మమ్మల్ని ఓదార్చే, ఆదరించే ప్రవక్తలయ్యారు. మాకు రోగమొస్తే, రొష్టొస్తే తాయెత్తులిచ్చి అభయమిచ్చే దేవుళ్లయ్యారు. మేం అందరం ముసల్మానులమైనాం. మేం ఈ దేశ మూలవాసులం. ద్రావిడులం. మాదిగలం. మాలలం. ఆదివాసీలం. బీసీలం!

మాదిగ వాడలూ తురక బజార్లూ / మురిక్వాల్వల్నీ 'నీసు కంపుల్నీ
ఒక్కలాగే మోస్తుంటాయ్ / వాని గుడిసెలో ఎందు తునకలై
మా సాయమాన్లో కవాబులై / దండేనికి వేలాడే 'కౌసు వాసన'
మా బంధుత్వాన్ని చెబుతోంది -స్కైబాబ

మేం మతం మారినవాళ్లం కాము. మాకు మతం లేకుండె. ఈ దేశంలో ఆదివాసీలకు, దళితులకు, బీసీ కులాలకు మతం లేదు. మాకు ఇష్టమై ఇస్లాం స్వీకరించాం. మాలో కొందరు క్రైస్తవం స్వీకరించారు. ఇస్లాం, క్రైస్తవం స్వీకరించకుండా ఉండిపోయిన మా దళితుల్ని, ఆదివాసీల్ని, బీసీ కులాల్ని ఇవాళ బిజెపి, ఆరెస్సెస్ 'హిందువుల'ంటున్నాయి. మేం హిందువులం కామని బీసీల తరపున ప్రొ.కంచ ఐలయ్య పుస్తకం రాశాడు. దళితుల తరపున దళిత కవులు, మేధావులు అంటున్నారు. ఇంకా అంటారు. ఇన్నాళ్లు కప్పిపుచ్చిన నిజాల్ని, కుట్రపూరిత ఆరెస్సెస్ గోబెల్ ప్రచారాల్ని బద్దలు చేస్తారు. రేపటికి రాజ్యానికొస్తారు.

స్వాతంత్ర్యానికి ముందు అగ్రకులస్తులంతా కలిసి మమ్మల్ని మైనారిటీలన్నారు. (ముస్లింలు, క్రైస్తవులు, సిక్కులు, దళితులు, ఆదివాసులందర్నీ మైనారిటీలన్నారు. రిజర్వేషన్లిచ్చారు.) ముస్లింలకు 25 శాతం రిజర్వేషన్లు సాధించుకున్నాం. ప్రత్యేక నియోజకవర్గాలను కూడా సాధించుకున్నాం. స్వాతంత్ర్యం తర్వాత అవన్నీ లేకుంట చేశారు. పాకిస్తాన్‌కన్నా మనదేశంలోనే ముస్లింలం ఎక్కువమందిమున్నాం. 'మతం' మారి ఇస్లాంలో చేరిన బ్రాహ్మణులు, అగ్రకులాలవాళ్లు పాకిస్తాన్ పోయారు. ధనిక ముస్లింలంతా పాకిస్తాన్ వెళ్లిపోయారు. ఇక్కడున్న మేమంతా దళిత

ముస్లింలం. పేద ముస్లింలం. ఈ మట్టిమీది ప్రేమతో ఈ గడ్డనే హత్తుకుపోయినవాళ్లం. అట్లాంటి మాకు రిజర్వేషన్లు లేకుండా ఎట్లా చేశారు? 57 ఏండ్లు అన్యాయం చేసింది చాలు! మాకివాళ దక్కాల్సినంత రిజర్వేషన్ ఇవ్వాల్సిందే.

మేం ఈ దేశ మూలవాసులం! ద్రావిడులం!

మొన్న దస్యుణ్ణి నిన్న ఛండాలుణ్ని / ఇవాళ నా సవాలక్ష గాయాల సాక్షిగా సాయిబుని / నిజానికి నేను దళితుణ్ణి -ఖాజా

కేవలం 2 నుంచి 3 శాతం ముస్లింలు మాత్రమే ఈ దేశంలో బైటి దేశాల నుంచి వచ్చినవారు. మిగతా 97 శాతం ఈ దేశ మూలవాసులే. 'అంటబడనివ్వని' కులాలనుంచీ, 'వెనకబడేయబడ్డ' కులాలనుంచీ ఇస్లాం స్వీకరించినవారే. ఈ విషయాన్ని తొక్కిపెట్టి 'హిందూత్వ'వాదులు కుట్ర చేశారు. మమ్మల్ని బైటి దేశస్తులుగా దుష్ప్రచారం చేశారు. దేశద్రోహులుగా, ఐఎస్ఐ ఏజెంట్లుగా ముద్రలు వెయ్యడానికి ప్రయత్నించారు. కానీ మేమంటున్నాం-

మేం ఈ దేశ మూలవాసులం! ద్రావిడులం!

ఇరానియన్లను, ఈజిప్షియన్లను, ఆఫ్ఘనిస్తానీలను చూడగానే గుర్తుపట్టవచ్చు. నీగ్రోలను, తెల్లవాళ్లను గుర్తుపట్టవచ్చు. ఆఖరికి మన ఉపఖండంలోనే ఉన్న నేపాలీలను చూడగానే గుర్తుపట్టవచ్చు. వాళ్లు కూడా మమ్మల్ని చూడగానే ఇండియన్లుగానే గుర్తుపడతారు! ఎందుకంటే (ఆంత్రొపాలజీ ప్రకారం) భౌగోళిక ఉష్ణోగ్రతలకు అనుగుణంగా ఈ భుగోళంలోని వివిధ ప్రాంతాల్లో వివిధ రకాలుగా, భిన్నమైన శరీర నిర్మాణాలతో మనుషులున్నారు. అట్లే మనమంతా ఒక్కలాగే ఉన్నాం. అందుకే ఇక్కడ దళితులూ-వేమూ, బిసీలూ-వేమూ, ఆదివాసీలూ-మేమూ అన్నదమ్ముల్లాగే కనిపిస్తాం. మా ముఖ కవళికలూ, వాళ్ల ముఖాలు (కాపాలాలు, ముక్కులు) ఒక్కతీరుగానే ఉంటాయి. ఎందుకంటే వాళ్లే మేమైనాం కాబట్టి. అందుకే మేం ఈ దేశ మూలవాసులం. ద్రావిడులం.

రండి మాతో.. ఆనవాళ్లు చూపుతం- హైదరాబాదులో ధోబీలు (చాకలి), హజామ్ (మంగలి), ఖసాబ్ (కటిక), సునార్ (కంసాలి), బడయ్ (వడ్రంగి) తదితర వృత్తులు కొనసాగిస్తున్న ముస్లింలున్నారు. నల్గొండ టౌన్‌లో హైదర్‌ఖాన్‌గుడ, మాన్యంచెల్క, జామ మసీదు, అక్కచెల్మలాంటి ప్రాంతాల్లో సగంమంది మాలమాదిగలుంటే సగంమంది ముస్లింలున్నారు. ఇండ్లన్నీ కలిసిపోయి ఉంటాయి (దాన్నిబట్టి ఎవరు ముస్లింలుగా మారారో అర్థమవుతుంది).



నల్గొండ జిల్లా కొప్వోల్ దగ్గర ఒక 'గంట ఫకీరోల్ల గూడెం' ఉంది. చీకటితోనే గంట కొడుతూ అడుక్కుంటానికి ఊర్లలోకి వచ్చేవాళ్లు వీళ్లు. బహుశా 'యాచకుల'నుంచి ఇస్లాం స్వీకరించినవారు. అన్ని జిల్లాల మారుమూలల్లో ఎలుగుబంటితో ఊర్లలోకి అడుక్కుంటానికి వచ్చే ముస్లింలున్నారు. ఊరూరు తిరుగుతూ కమ్మరి పని చేసేవారు (లోహార్), విగ్రహాలు పోతపోసే ముస్లింలున్నారు. ఖమ్మం పక్కన 'జింకలోల్లు'న్నారు. కడప జిల్లాలో గారడి వాళ్లున్నారు. పహిల్వాన్ (దొమ్మర?)లున్నారు. వేంపల్లిలో 'బోరెవాలె' (ఈతచాపలు అల్లేవాళ్లు) 300 ఇండ్లున్నాయి. వీళ్లను బొంతలోల్లు అని మన తెలుగోల్లు పిలుస్తారు. ఇప్పుడు ప్లాస్టిక్ చాపలు వచ్చేశాయి కాబట్టి ఈతచాపలు ఎవరూ కొనడంలేదు. వాళ్లు కుట్టిన చాపలు వాళ్లలో ఎవరైనా చచ్చిపోతే చుట్టి బొందపెట్టడానికి పనికివస్తున్నాయి. వాళ్లిప్పుడు దుర్భరమైన దారిద్ర్యంలో మగ్గుతున్నారు. జిల్లావ్యాప్తంగా వీళ్లున్నారు. వేంపల్లిలోనే ఘోడేవాలె (గుర్రాలోల్లు), లఖ్‌దేవాలె (అడవిలోకెళ్లి కట్టెలు కొట్టుకొచ్చి అమ్ముకొనేవాళ్లు) ఉన్నారు. నల్గొండలో ఊర్లకు ఊర్లు కాశోల్లు (ఫత్తర్‌ఫోడ్) ఉన్నారు. నల్గొండకు దగ్గర్లోనే కాశివారిగూడెం, కాసారం ఉన్నాయి. వీళ్లంతా రాళ్లు కొట్టే ముస్లింలు. రాళ్లు కొట్టడమే తమ పిల్లలకు విద్య. వేరే చదువులు చదివించలేకపోతున్నామంటున్నారు. మాలలనుంచి, పద్మశాలీలనుంచి ఇస్లాం స్వీకరించి రకరకాల పేర్లతో పిలువబడుతున్న దూదేకులవాళ్ల గురించి చాలావరకు అందరికీ తెలుసు. బీడీలు చుట్టే ఆడవాళ్లు, విస్తర్లు కుట్టే ఆడవాళ్లు, మిషిన్లు తొక్కే ఆడవాళ్లు, కూలినాలికిపోయే ఆడవాళ్లు ఎందరో..! ఇట్లా ఎన్నో ఉదాహరణలు.. రాజస్తాన్‌లో రోడ్లపై చెప్పులుకుట్టే ముస్లింలు కనబడతారు. బెంగాల్లో కూడా చెప్పులపని, తోలుపని చేస్తున్నారు. బనారస్‌లాంటి చోట్ల బట్టలునేసే ముస్లింలున్నారు. బీహార్లో పాములు ఆడించే 'సఫేరా'లు ముస్లింలే. ఇట్లా అన్ని రాష్ట్రాల్లో వివిధ వృత్తులుచేసే ముస్లింలు ఆనవాళ్లుగా కనిపిస్తారు. ఆదివాసీ-దళిత- బహుజనుల 60కి పైగా వృత్తుల్లో ముస్లింలు కొనసాగుతున్నారని కొన్ని నివేదికలు చెబుతున్నాయి. దీన్నిబట్టి ఆయా కులాలవాళ్లే ముస్లింలుగా మారారని అర్థమవుతుంది. ఇట్లాంటివాళ్లను రిజర్వేషన్లకు దూరంగా ఎలా ఉంచుతారు?

న ఘుర్‌కా న ఘాట్‌కా!

ఇస్లాం స్వీకరించకముందు మాకు కులవృత్తులుండె. అక్కడా ఇక్కడా నవాబుల పాలన ఉన్న సమయంలో తమది 'నవాబుల మతం'గా ఫీలయి కొంత, ఆయా

వృత్తుల్లో కొనసాగుతున్నవాళ్లను ఇతర బ్రాహ్మణ సమాజం 'నీచం'గా చూస్తుండడంవల్ల మరింత ముస్లింలంతా వృత్తులు వదిలేసుకున్నారు. చిన్నాచితక ఉద్యోగాలు సంపాదించుకున్నారు. కొంత భూముల్ని 'పట్టా చేయించు'కున్నారు. వ్యవసాయం చేయడానికి, చేయించుకోనికి వీళ్లేమీ రెడ్లు, కమ్మలూ, వెలమల్లాంటివాళ్లు కాకపోవడంతో తర్వాత్తర్వాత ఆ భూములు రెడ్లు, కమ్మలు, వెలమలే సొంతం చేసుకున్నారు. ఇటు వృత్తులు లేకుండాపోయాయి, అటు భూముల్లేకుండా పోయాయి. రెంట చెడ్డ రేవడి బతుకులయ్యాయి. అదనంగా రిజర్వేషన్లు లేకుండా చెయ్యడంతో మా బతుకులు అన్యాయమైపోయాయి. రోడ్డున పడ్డాయి. ఇవాళ రోడ్ల పక్కన పండ్ల బండ్లన్నీ ముస్లింలవే. రోడ్‌సైడ్ మెకానిక్‌లంతా ముస్లింలే. సైకిల్ గిల్లల పంక్చర్‌లు బాగుచేసేవాళ్లంతా ముస్లింలే. దర్జీలు, గడియారాలు బాగుచేసేవాళ్లు, హరేక్‌మాల్‌బండ్లవాళ్లు, గరంమిర్చిబండ్లు, చాయ్ హోటళ్లు, చిన్నచిన్న చెప్పుల షాపులు, టెంట్‌హౌజ్‌లు, 'చిల్లర' బేరగాళ్లంతా ముస్లింలే కావడం యాదృచ్ఛికమా? ఆటోవాలాలు, కారు-జీపు-లారీ డ్రైవర్లంతా ముస్లింలే కావడం యాదృచ్ఛికమా? ఇటు చదువుకునే అవకాశాల్లేక, అటు ఓ.సి. కావడంతో ఉద్యోగాలు రాక 'ధోబీ కా ఘదా న ఘర్‌కా న ఘాట్‌కా' బతుకులైపోయాయ్...

మేం నవాబులం కాము

మా తాత ముత్తాత లెవరూ నవాబులు కారు. మేం నవాబులం ఎట్లవుతాం? 400 ఏండ్లు పరిపాలించినవాళ్లకు రిజర్వేషన్లెందుకు అంటున్న కొందరి మందబుద్ధిని, సంకుచిత వ్యాఖ్యల్ని మేం ఖండిస్తున్నాం. 90 శాతం మందిమి ఇక్కడి మూలవాసుల్నించి ముస్లింలమైన మేము నవాబులం కామని, మావి నవాబు వంశాలు కావని స్పష్టం చేస్తున్నాం.

బీసీ కులాల మిత్రులారా!

బి.సి.అంటే బ్యాక్‌వర్డ్ క్యాస్ట్స్ కాదు బ్యాక్‌వర్డ్ క్లాసెస్ అన్న విషయం గమనించాలని కోరుతున్నాం. కొందరు బిసి మిత్రులు రకరకాల వ్యాఖ్యలు చేస్తున్నారు. తప్పుడు వ్యాసాలు, ఉపన్యాసాలు ఇస్తున్నారు. రాజ్యాంగం ప్రకారం సామాజికంగా, విద్యాపరంగా వెనుకబడి ఉన్న ఏ కమ్యూనిటీనైనా బ్యాక్‌వర్డ్ క్లాస్‌గా పరిగణిస్తూ రిజర్వేషన్ కల్పించవచ్చు. అలా వెనకబడి ఉన్న కమ్యూనిటీ ఒక కులం కావచ్చు, మతం కావచ్చు.

స్వాతంత్ర్యం వచ్చిన 57 ఏళ్లుగా అన్ని రంగాల్లో ముస్లిం సమాజాన్ని అణగార్చడానికి అన్నిరకాల కుట్రలు చేసిన సంఘపరివార్ ఇవాళ మాకు రిజర్వేషన్



కల్పించడాన్ని వ్యతిరేకిస్తున్నది. దేశంలోని అన్ని పార్టీలు, సంస్థలు, మేధావులే కాక సామాన్య జనం సైతం ముస్లింల దైన్య స్థితిని గుర్తిస్తూ రిజర్వేషన్‌ను సమర్థిస్తుంటే కేవలం బిజెపి మాత్రమే వ్యతిరేకించడం దాని అసలు నైజాన్ని తెలుపుతుంది. ముస్లింలను ఇంకా ఇంకా అణచివేసి దేశంలో ఇంకా కొన్ని గుజరాత్‌లను సృష్టించాలని చూస్తుండడాన్ని అర్థం చేసుకోవాలని కోరుతున్నాం. దేశంలో 15 శాతంగా ఉన్న అతిపెద్ద సమూహం అన్ని రకాలుగా వెనకబడి ఉంటే దేశం ఎలా పురోగతి సాధిస్తుందని మేం ప్రశ్నిస్తున్నాం.

రాజస్థాన్‌లో ఎన్నికలకు ముందు ఇబిసి కింద అగ్రకులస్తులకు, బ్రాహ్మణులకు సైతం రిజర్వేషన్లు కల్పిస్తామని ప్రకటించిన బిజెపి అన్నిరంగాల్లో అట్టడుగున పడివున్న ముస్లింలకు రిజర్వేషన్లు కల్పించడం ఎందుకు సరైన విధానం కాదో పునరాలోచించుకోవాలి. ఎన్నికలకు ముందు టిడిపి సైతం ముస్లింలకు 3 శాతం రిజర్వేషన్లు కల్పిస్తామని ప్రకటించింది. అప్పుడు టిడిపి పొత్తులో ఉండి కూడా చప్పుడు చేయని బిజెపి ఇప్పుడు లొల్లి చెయ్యడం ఏమిటి? మతం ప్రాతిపదికన గొడవలు చేస్తున్నది బిజెపియేననే విషయాన్ని ప్రజలంతా గ్రహించాలని కోరుతున్నాం. సామాజికంగా, విద్యాపరంగా ఎంతో వెనకబడివున్న ముస్లింలకు ప్రభుత్వం కల్పించిన రిజర్వేషన్‌కు ప్రజాస్వామిక వాదులందరూ మద్దతు తెలపాలని కోరుతున్నాం. 1991 జనాభా లెక్కల ప్రకారం 5 శాతం అన్నారు, 2001 జనాభా లెక్కలు కూడా వచ్చి ఉన్నాయి కాబట్టి ప్రస్తుత వెనుకబాటుతనం ప్రాతిపదికగా ముస్లింలకు రిజర్వేషన్ కల్పించాలని ప్రభుత్వాలను కోరుతున్నాం.

*ఇయ్యాల ఉరికొచ్చి ఉరికొచ్చి / మనమంతా ఇందుగులం / గంగాసింధు బిందుగులం / అంటే ఎట్టా సామీ / మా తాతల్ని తండ్రుల్ని పంచముల్ని చేసి / గుడికీ బడికీ దూరంగా తరిమితే / మీకు పడని / అలిఫ్-బే-తే-సే-లు దిద్దింది / ఈ మసీదుల్లోనే కదా / ఈ సదువంతా నింపుకుంది / మీరనుకునే పరాయి చర్చిలోదే కదా... / ఎంత విసిగి వేసారితే / మా లచ్చుమయ్యలంతా లతీఫ్‌లయింర్రో / సోమన్నలంతా సామేలులయింర్రో... / అట్లాంటిదిప్పుడు / మా లందె గోళాల్లో / మీ పూలెట్టా వికసిస్తాయి సామీ*

అంటున్నారు దున్న యాదగిరి అనే దున్న యాదగిరి. కాబట్టి ముస్లింలను బహుజనులంతా తమ సోదరులుగా గుర్తించాలని కోరుతున్నాం.

- 'మర్ఫా' ముస్లిం రిజర్వేషన్ మూవ్‌మెంట్
చేసిన సందర్భంలో వేసిన కరపత్రం, 2003

# ముస్లింలకు తెలంగాణ అత్యవసరం

కిసీ ఖౌమ్‌కో బర్బాద్ కర్నా హైతో
పహ్‌లే ఉస్ కీ జబాన్ ఖీంచ్‌లో...

అంటారు. తెలంగాణ ముస్లింల పరిస్థితి ఇలాగే ఉంది. మా నుంచి మా భాషను దూరం చేశారు.

నా పేరు యూసుఫ్. నేనొక ముస్లింని. తెలంగాణ ముస్లింని. కవిని, రచయితను. జర్నలిస్టును. నేను ఇంట్లో ఉర్దూ మాట్లాడతాను. ఊరివాళ్లతో తెలంగాణ తెలుగు మాట్లాడతాను. స్కూల్లో మాత్రం ఆంధ్రా తెలుగులో చదువుకున్నాను. కవిగా నేను కవిత రాయాలంటే ఏ భాషలో కవిత్వం పలుకుతుందో ఆలోచించండి. నా ఊహలు ఏ భాషలో వస్తాయో ఆలోచించండి. ఒక మానసిక హింసను మేము అనుభవిస్తున్నాం. నేను తెలుగులో కవిత్వం రాస్తూ అవసరమైన చోట ఉర్దూ పదాలు వాడితే, టైటిల్ ఉర్దూలో పెడితే ఆంధ్రావాళ్లు నాలాంటి ముస్లిం కవుల మీద విమర్శలు చేశారు. ఉర్దూ పదాలు వాడే బదులు ఉర్దూలోనే కవిత్వం రాయవచ్చు కదా అని అపహాస్యం చేశారు. వాళ్లు మాత్రం తమ కవిత్వంలో ఇంగ్లీషు పదాలు విరివిగా వాడతారు. ఉర్దూ విషయంలో మాత్రం ఎన్నో అభ్యంతరాలు వ్యక్తం చేస్తారు. ఇదంతా ఎందుకు జరుగుతుందంటే వాళ్లకు ఉర్దూ మీద ఏ మాత్రం ప్రేమ లేదు. తెలంగాణ వారికి ఉన్న ప్రేమ ఆంధ్రావారికి ఉండదు అని ఈ విషయంలో అర్థమయ్యింది.. ఉర్దూ ఇవాళ అంతరించి పోయే ప్రమాదంలో పడడానికి కారణం కేవలం ఆంధ్రా వలసవాద పాలనే.

నిజాం రాజుల కాలంలో ఉర్దూ రాజభాషగా ఉండేది. దాంతో ఇక్కడివాళ్లంతా ఉర్దూలో చదువుకున్నారు. హైదరాబాద్ రాజ్యాన్ని ఇండియన్ యూనియన్‌లో బలవంతంగా కలుపుకున్నాక ఇక్కడి ప్రజల మనోభావాలను పరిగణలోకి తీసుకోకుండానే రాజభాషగా ఉర్దూను రద్దు చేసి తెలుగును



ప్రవేశపెట్టారు. కొన్నాళ్ల సమయమిచ్చి తెలుగుగానీ, ఇంగ్లీషుగానీ నేర్చుకోవాలని ఆంక్షలు పెట్టారు. చుట్టూ ఉన్న ఉర్దూ వాతావరణంలోంచి ఒక్కసారిగా ఇతర భాషలు నేర్చుకోవడం అంత సులువు కాదన్న విషయం తెలిసిందే. నేర్చుకోలేని ఉద్యోగస్తులు ఉద్యోగాలు కోల్పోవాల్సి వచ్చింది. ఆ తరువాత నుంచి తెలుగు మీడియం స్టార్ట్ అయ్యింది. అప్పటివరకు ఉర్దూ చదువుకుని ఉన్న వాళ్లందరూ ఏమయ్యారో ఏ లెక్కలూ మనకు చెప్పవు. వాళ్లంతా చిల్లర వ్యాపారాలు చేసుకునే దుస్థితిని నెట్టబడ్డారు. రిక్షాలు తొక్కే పరిస్థితి కల్పించారు.

## ఉర్దూ రచయితలు వేరొక లోకంగా బతుకుతున్నారు

నేటి తరాలు ఇంట్లో ఉర్దూ మాతృభాషగా మాట్లాడుతున్నప్పటికీ ఉర్దూలో చదివే అవకాశాలు లేక తెలుగులోనే చదువుకోవాల్సి వచ్చింది. మేము ఇవాళ తెలుగు ముస్లింలుగా చూడబడుతున్నాం. అయినప్పటికీ దేశంలోనే ప్రసిద్ధి పొందిన ఉర్దూ కవులు, రచయితలు తెలంగాణలో ముఖ్యంగా హైదరాబాద్‌లో ఉన్నారు. వారికి ఆంధ్రా వలస పాలకులు ఏ మాత్రం గౌరవమిచ్చింది లేదు. వారు వేరొక లోకంగా బతకాల్సి వస్తున్నది. నిజాంల కాలంలో భారత ఉపఖండంలోనే ఉర్దూ కవులు, రచయితలకు హైదరాబాద్ రాజ్యం ప్రసిద్ధి పొందింది. వారిని ఎంతో ఆదరించింది.

## ఉర్దూ సమ్మిళిత భాష తెలుగోల్ల, ముస్లింల సహజీవనానికి తోడ్పడింది

200 ఏళ్ల నిజాంల పాలనలో ఉండడం వల్ల రాజభాషగా ఉర్దూ ఉండడంతో ఇక్కడి తెలుగు డిఫరెంట్ యాక్సెంట్‌ను తీసుకుంది. వేల ఉర్దూ పదాలు తెలుగైజ్ అయ్యాయి. తెలుగు ఉర్దూ మిక్స్‌డ్ లాంగ్వేజ్‌లో ఇక్కడివాళ్లు మాట్లాడుకోవడం చూస్తాం. ఆ మిక్స్‌డ్ భాష ఇక్కడివారి జీవితంలో భాగమైంది. నిజానికి తీయని ఉర్దూ సమ్మిళిత తెలుగు వల్ల ఇక్కడి తెలుగువారికి ముస్లింలపై, ముస్లింలకు తెలుగువారిపై అప్రకటిత ప్రేమ, వాత్సల్యం ఉండేవి. అంటే సమ్మిళిత భాష అనేది హిందూ ముస్లింల మధ్య సహజీవనానికి తోడ్పడింది. తెలంగాణ ఏర్పడడం వలన మళ్లీ ఆ వాతావరణం వస్తుందని మేం ఆశిస్తున్నాం. ఆంధ్రావారి ఉర్దూ వ్యతిరేకత, ముస్లిం వ్యతిరేకత నుంచి తెలంగాణ ముస్లింలు తప్పించుకోగలుగుతారు.

జనాభా పరంగా తెలంగాణలో ముస్లింల శాతం ఎక్కువ. కానీ స్థానిక ఉద్యోగాలు ఇక్కడి ముస్లింలకు దక్కకుండా పోయాయి. ఇవాళ ముస్లింలకు ఏమైనా ఉద్యోగాలు దొరుకుతున్నాయంటే కేవలం ఫోర్త్ క్లాస్ ఉద్యోగాలే. అవి కూడా చాలా తక్కువ. అందుకే చాలామంది ముస్లింలు భార్యాపిల్లల్ని వదిలి దేశం కాని దేశాలకు వలసలు పోయే పరిస్థితి ఏర్పడింది. విద్యా, ఉద్యోగ రంగాల్లో ముస్లింల బాగోగుల గురించి ఆంధ్రా వలస ప్రభుత్వాలు ఏమాత్రం శ్రద్ధ చూపడం లేదు.

## ఆంధ్రావారు వచ్చాకే హైదరాబాద్‌లో మత ఘర్షణలు

ఆంధ్రావారు వచ్చాకే హైదరాబాద్‌లో మత ఘర్షణలు జరిగాయి. అంతకు ముందు వందల ఏళ్లుగా తెలంగాణలో హిందూ ముస్లింలు కలిసిమెలిసి సహజీవనం కొనసాగిస్తున్నారు. ఆంధ్రా రాజకీయ నాయకులు ముఖ్యమంత్రులను మార్చడానికి హైదరాబాద్‌లో మత ఘర్షణలు సృష్టించిన చరిత్ర తెలిసిందే. తెలంగాణలోని తెలుగువారికీ, ముస్లింలకూ మధ్య సహజీవనం పెంపొందించుకోవాలన్నా వీలైనంత త్వరగా ఆంధ్రావారి నుంచి విడిపోయి తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం ఏర్పడడం అవసరం.

## ఎంఐఎం ముస్లింల ప్రతినిధి కాదు

తెలంగాణలోని ముస్లింలంతా తెలంగాణ కోరుతున్నారు. ఒక్క హైదరాబాద్ పాతబస్తీకి పరిమితమైన ఎంఐఎం మాత్రమే వ్యతిరేకంగా మాట్లాడుతున్నది. తెలంగాణ ముస్లింలకు ఎంఐఎం ప్రతినిధి కాదు. ప్రతినిధిగా మాట్లాడడాన్ని మేం వ్యతిరేకిస్తున్నాం. నిజానికి ఎంఐఎం వల్ల పాతబస్తీ ముస్లింలకు ఒరిగిందేమీ లేదు. వారిని గరీబుల్లాగే ఉంచి, నిరక్షరాస్యులుగానే ఉంచి తమకు తమ పబ్బం గడుపుకుంటున్నారనే విషయం అందరికీ తెలిసిందే.

'సింగిడి' తెలంగాణ రచయితల సంఘం తరపున
ముస్లిం ప్రతినిధిగా శ్రీకృష్ణ కమిటీ ముందు చెప్పిన విషయం



# తెలంగాణ ఏర్పాటు వల్లనే ముస్లింలకు మేలు

మన భూగోళంపై పుట్టిన జీవి ఏదైనా తనకు చేతనైన విధంగా కడుపునకు చాలినంత తిండి సంపాదించుకుంటుంది. కడుపు నిండా తిని నిశ్చింతగా నిద్రపోతుంది. ఆ పూటకు చాలినాక కూడా మరింత దోచి దాచిపెట్టుకోవాలని అనుకోదు. పులి అయినా సింహమైనా తాను వేటాడిన జంతువును తిన్నంత తిని పక్కకు తొలగిపోతుంది. అది ప్రకృతి సహజం. కాని ఆ జీవుల్లోంచే ఎదిగిన మనిషి మాత్రం తనకు చాలినంత సంపాదించుకుని కూడా అత్యాశకు పోయి మరింత కూడబెట్టుకునేందుకు అలవాటు పడ్డాడు. అందులో భాగంగానే వెనకబడ్డ జాతుల్ని, వెనకబడ్డ ప్రాంతాల్ని అభివృద్ధి చెందిన జాతులు, ప్రాంతాల వాళ్లు దగా చేయడం, దోచుకోవడం జరుగుతున్నది. ఇదే అంశం తెలంగాణ విషయంలోనూ, తెలంగాణ ముస్లింల విషయంలోనూ అన్వయించుకోవచ్చు. ఆంధ్రా వారు తెలంగాణను ఆక్రమించుకోవడంలోనూ, ముస్లిమీయత కలగలిసిన తెలంగాణ సంస్కృతిని ధ్వంసం చేయడంలోనూ ఈ క్రమమే కనిపిస్తుంది. అయితే పైన చెప్పుకొన్నట్టు తెలంగాణవారిలో ప్రకృతి సహజ లక్షణమైన ఎంత వరకు అవసరమో అంతవరకే సంపాదించుకోవడం కనిపిస్తుంది. అది ముస్లింలలో మరింత కనిపిస్తుంది. తెలంగాణ ముస్లిం సంస్కృతిలోనే ఇది ఒక భాగంగా కనిపిస్తుంది. అలాంటివారికి దోచుకుని దాచుకునే స్వభావం కల ఆంధ్రా వారిని కలపడమే చరిత్రలో జరిపిన ఒకానొక తప్పు. అందువల్లనే ఇలా భిన్న సంస్కృతులున్న రెండు జాతుల మధ్య ఘర్షణ నిత్యంగా జరుగుతూ వస్తున్నది. దీనికి పరిష్కారం ఒక్కటే, తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు చేయడమే.

తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు చేయడం వల్లనే ఇక్కడి ముస్లింలకు మేలు జరుగుతుంది. తెలంగాణను ఆంధ్రలో కలపడం వలన తెలంగాణ ముస్లింలు చాలా నష్టపోయారు. వారు నష్టపోయిన ఒక్కో రంగాన్ని ఇలా విశ్లేషించుకోవచ్చు.

**1. సంస్కృతి:** తెలంగాణవారు వందల సంవత్సరాలు కుతుబ్‌షాహీలు,

అసఫ్‌జాహీల పాలనలో ఉండడం వలన, అదనంగా చుట్టూరా మొగలాయీ పాలన కూడా ఉండడంతో వారి సంస్కృతి అంతా ప్రాచ్య (ఓరియంటల్ దేశాల), ఇరాన్ పర్షియా, ఇరాక్, టర్కీ వగైరా సంస్కృతితో ప్రభావితమైంది. కాబట్టి ఇక్కడి భాష, వేషధారణ, ఆహారపు అలవాట్లు, నిద్ర, కళలు, సాహిత్యం అన్నీ కూడా ప్రాచ్య దేశాలను పోలి ఉంటాయి. గ్రామాల్లో ఈ ప్రభావం కొంత తక్కువ కనిపించినా పట్టణాలు, ముఖ్యంగా హైదరాబాద్‌లో ఈ సంస్కృతి వేళ్లూనుకునిపోయింది. ఈ సంస్కృతికి భిన్నంగా చివరి 200 సంవత్సరాలు ఆంగ్లేయుల పాలనలో ఉండిన ఆంధ్రా ప్రాంతంవారు పశ్చిమ దేశాల (బ్రిటన్, ఫ్రాన్స్), అమెరికా వగైరా సామ్రాజ్యవాద సంస్కృతికి అలవాటు పడ్డారు. ఈ రెండు సంస్కృతుల మధ్య క్లాష్ ఏర్పడుతున్నది అందువల్లనే.

తెలంగాణ ముస్లింలు భూములు కోల్పోయిన వారిగా, ఆంధ్రా వాళ్లు భూములు ఆక్రమించుకున్న వారుగా మనకు ఎన్నో దాఖలాలు తెలంగాణలోనూ ముఖ్యంగా హైదరాబాద్‌లోనూ, హైదరాబాద్ చుట్టూరా కనిపించడం అందుకు నిదర్శనం.

**2. భాష:** 200 సంవత్సరాలు నిజాంల పాలనలో ఉండడం వల్ల రాజభాషగా ఉర్దూ ఉన్న కారణంగా తెలంగాణ వారందరూ చాలా వరకూ ఉర్దూ మీడియంలోనే చదువుకున్నారు. ఉర్దూ ప్రభావం వల్ల ఇక్కడి తెలుగు డిఫరెంట్ యాక్సెంట్‌ను తీసుకుంది. వేల ఉర్దూ పదాలు తెలుగైజ్ అయ్యాయి. తెలుగు ఉర్దూ మిక్స్‌డ్ లాంగ్వేజ్‌లో ఇక్కడి వాళ్లు మాట్లాడుకోవడం చూస్తాం. అలా ఆ మిక్స్‌డ్ భాష ఇక్కడి వారి జీవితంలో భాగమైంది.

అయితే హైదరాబాద్ రాజ్యాన్ని విభజించి ముక్కలు చేసి తెలంగాణను ఆంధ్రలో కలపడం వలన భాషా పరంగా ఎనలేని నష్టం జరిగింది.

కిసీ ఖౌమ్‌కో బర్బాద్ కర్నా హైతో
పహ్‌లే ఉస్ కీ జబాన్ ఖీంచ్‌లో...

అన్నట్లుగా తెలంగాణ వారితో పాటు ఇక్కడి ముస్లింల భాషను గుంజుకోవడం, ధ్వంసం చేయడం జరిగింది. ఇంకా ఇంకా జరుగుతున్నది.

ఉర్దూ మీడియం పాఠశాలలన్నీ తెలుగు మీడియం పాఠశాలలుగా మార్చబడ్డాయి. సరే, నాచురల్ అనుకుందాం. కానీ తెలంగాణ తెలుగువారు ఆ పాఠశాలల్లో ఉపాధ్యాయులుగా, అధ్యాపకులుగా నియమించబడితే వారికి ఇక్కడి



పరిస్థితుల మీదా మనుషుల మీదా ప్రేమ ఉండి అర్థం చేసుకుని మసిలేవారు. అలా కాకుండా ఆంధ్ర నుంచి వలస వచ్చినా, తీసుకురాబడిన తెలుగువారి వల్ల ఇక్కడి వారు, ముఖ్యంగా ముస్లింలు ఎక్కువగా అవహేళనకు గురయ్యారు. వాళ్లే కాదు, హైదరాబాద్ పనిచేస్తున్న లక్షలాదిమంది ఆంధ్రావారు ఉర్దూ పట్ల, ఉర్దూ కలగలిసిన తెలుగు పట్ల ఏమాత్రం మమకారం లేకుండా ప్రతి మాటలోనూ తెలంగాణవారిని, ముస్లింలను తక్కువచేసి మాట్లాడుతూ అవమానించారు. ఆత్మన్యూనతలో పడవేశారు. ఈ కారణాన తెలంగాణ తెలుగు భాషకు, ఉర్దూకు ఎక్కువ నష్టం జరిగింది. ఉర్దూ అంతర్ధానమయ్యే ప్రమాదం ఏర్పడింది.

నిజానికి ఈ తీయని ఉర్దూ సమ్మిళిత తెలుగు వల్ల ఇక్కడి తెలుగువారికి ముస్లింలపై, ముస్లింలకు తెలుగువారిపై అప్రకటిత ప్రేమ, వాత్సల్యం ఉండేవి. అంటే సమ్మిళిత భాష హిందూ ముస్లింల మధ్య సహజీవనానికి తోడ్పడింది. తెలంగాణ ఏర్పడడం వలన మళ్లీ ఆ వాతావరణం వస్తుందని, రావాలని మేం ఆశిస్తున్నాం. ఆంధ్రావారి ఉర్దూ వ్యతిరేకత, ముస్లిం వ్యతిరేకత నుంచి తెలంగాణ ముస్లింలు తప్పించుకోగలుగుతారు.

**3. వేషధారణ:** పఠానీ సూట్, షేర్వానీ, లాల్చీ పైజమా, చుడీదార్ పైజమా, షట్‌సెల్వార్, పైజమా ఖమీజ్ తదితర వస్త్రధారణ ముస్లింలది. ఇవి తెలుగువారు కూడా ధరించడం అలవర్చుకున్నారు. దానికి భిన్నంగా కోస్తాంధ్రా ప్రాంతం సముద్రం దగ్గరగా ఉండడంతో వారి వస్త్రధారణలో ఎంతో తేడా ఉంది. ఉక్కపోత కారణంగా వారు లుంగీ కడితే, తెలంగాణ ముస్లింలు పైజమా వేసుకోవడం అలవాటు. ఈ పైజమాలపై, బొందెలపై ఆంధ్రావారు జోకులేయడం మామూలే.

**4. ఆహారపు అలవాట్లు:** హైదరాబాదీ బిర్యానీ ప్రపంచంలోనే ప్రసిద్ధి. ఆంధ్రాలో పలావ్ అని వండుతారు. మేము ఏ మాత్రం రుచి లేని ఆ పలావ్ తినలేము. రంజాన్ నెల అంతా హలీమ్, హరీస్ హైదరాబాద్‌లోనూ, తెలంగాణ పట్టణాలలోనూ ముఖ్యమైన ప్రత్యేక వంటకంగా విరివిగా అమ్ముడుపోతుంది. రంజాన్ పండుగ రోజు చేసే సేమ్యా అనేది మరో ప్రత్యేక వంటకం. ఆ వంటకం పట్ల ఊర్లలో తెలుగువారు చాలా ఆసక్తి చూపుతారు. ముస్లింలు కూడా తెలుగువారిని ప్రత్యేకంగా ఆ రోజు ఇంటికి పిలిచి సేమియా ఇస్తారు. ఇవాళ ఈ వంటకం తెలంగాణలో దాదాపు అందరూ చేసుకుంటున్నారు. అలాగే ఆనపకాయ (సొరకాయ)తో చేసే 'దాల్చ' ముస్లిం ఇండ్లల్లో ప్రత్యేక వంటకం.

పెళ్లిల్లో ఇది తప్పనిసరి. దీనికి ప్రతిగా ఆంధ్రాలో సాంబార్ అనే వంటకం చేస్తారు. ముస్లింల వల్ల అలవాటైన నాన్ వెజ్ వంటకాలు తెలంగాణాలో ఎక్కువ. వాటిలో రకాలు ఎన్ననేది లెక్కించలేం.

అట్లే పానీయాల విషయంలోనూ తేడా వుంది. తెలంగాణలో చాయ్ (టీ) తాగితే, ఆంధ్రాలో కాఫీ తాగుతారు. ఆంధ్రా టీకి తెలంగాణ టీకి తేడా ఉంటుంది. ఇరానీ చాయ్‌కి ఈ ప్రాంతం ప్రసిద్ధి. పౌనా, మలయ్ చాయ్, ...... తదితర రకాలు ఇక్కడ దొరుకుతాయి.

**5. కళలు సాహిత్యం:** కళలు, సాహిత్యం విషయంలోనూ చాలా తేడా ఉన్నది. ఉర్దూ ముషయిరాలు రాత్రి అన్నం తిన్న తర్వాత మొదలై రాత్రంతా నడిచే సంస్కృతి ఇక్కడ ఉన్నది. ఉర్దూ కవులు, రచయితలు తెలంగాణ అంతటా ఉన్నారు. హైదరాబాద్‌లో ఎక్కువగా ఉన్నారు. ఖవాలీ ప్రోగ్రాములు కూడా ఇక్కడ ఎక్కువే. ఆంధ్రా ప్రాంతంలో ఇవి కనిపించవు. ఇలా ఇంకా ఎన్నో వషయాలలో తేడాల వల్ల వారికీ వీరికీ పొసగని పరిస్థితి ఉంది. ఆంధ్రా వారి డామినేషన్ ఎక్కువ కావడంతో ముస్లిం కల్చర్‌లోని ఇలాంటి విభిన్న సాంస్కృతిక విషయాలు వివక్షకు గురవుతున్నాయి. ఆంధ్రావారికి తెలంగాణ ముస్లింలపై ఏ మాత్రం ప్రేమ లేదు. పైగా చిన్న చూపు. వెకిలిచూపూ. తమ ఆంధ్ర సంస్కృతి నుంచి ప్రతిదాన్నీ చూస్తూ ముస్లిం సంస్కతుల్ని, అది మిళితమైన తెలంగాణ సంస్కృతిని చులకన చేస్తూ వస్తున్నారు. మాకు సంస్కృతీ సాంప్రదాయాలు, భాష రాదని, తాము వచ్చి అన్నీ నేర్పామని, నేర్పుతున్నామని నిజమైన సంస్కృతి నేర్పుతున్నామని అహంభావాన్ని ప్రదర్శిస్తుంటారు. ముఖ్యంగా ముస్లిం సంస్కృతి అంటే అదేదో పరాయి సంస్కృతి అన్న ఏహ్యభావం చూపుతుంటారు. వీటివల్ల వారికి తెలంగాణ ముస్లింలపై ఏనాడూ ప్రేమ లేదు.

విద్యలో ముస్లింల శాతం చాలా తక్కువగా వుంది. దాని గురించి ఆంధ్రా ప్రభుత్వాలు పట్టించుకోవడం లేదు. ఉద్యోగాల్లోనూ ముస్లిం శాతం హైదరాబాద్ రాజ్యం ఉన్నప్పటికీ ఇప్పటికీ చాలా తగ్గిపోయింది. వీటి గురించి కూడా ప్రభుత్వాలకు చింత లేదు. ఆర్థికంగా కూడా ఆంధ్రా వారి వల్ల తెలంగాణ ముస్లింలు బాగహా నష్టపోయారు. రోడ్‌సైడ్ చిల్లర వ్యాపారాల్లోనే ముస్లింలు ఎక్కువగా ఒదిగిపోతున్నారు. డబ్బు సంచులతో వలస వచ్చి పెద్ద పెద్ద షాపులు, మాల్స్, ఫ్రూట్ మార్కెట్స్ తెరిచే ఆంధ్రావారితో చిన్న సన్న ముస్లిం వ్యాపారస్తులు పోటీపడలేక ఎంతో నష్టపోతున్నారు. నిజానికి రాష్ట్రంలో ఒక పెద్ద సమూహం (దాదాపు 15



నుంచి 20 శాతంగా ఉన్న సమూహం) అన్ని రంగాల్లో వెనకబడి ఉంటే రాష్ట్రాభివృద్ధి ఎలా సాధ్యం?

ఆంధ్రావారు వచ్చాకే మత ఘర్షణలు: ఆంధ్రావారు వచ్చాకే హైదరాబాద్‌లో మత ఘర్షణలు జరిగాయి. అంతకు ముందు వందల ఏళ్లుగా తెలంగాణలో హిందూ ముస్లింలు కలిసిమెలిసి సహజీవనం కొనసాగిస్తున్నారు. ఆంధ్రా రాజకీయ నాయకులు ముఖ్యమంత్రుల్ని మార్చడానికి హైదరాబాద్‌లో మత ఘర్షణలు సృష్టించిన చరిత్ర అందరికీ తెలిసిందే. తెలంగాణలోని తెలుగువారికీ, ముస్లింలకూ మధ్య సహజీవనం పెంపొందించుకోవాలన్నా వీలైనంత త్వరగా ఆంధ్రావారి నుంచి విడిపోయి తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం ఏర్పడడం అవసరం.

చారిత్రకంగా, సాంస్కృతికంగా ఉన్న భావ సారూప్యత, సాంస్కృతిక సారూప్యత వల్ల ఒకరినొకరు అర్థం చేసుకోవడం, శాంతిని స్థాపించుకోవడం ద్వారా సహజీవనం సాగించే అవకాశం ఉంది.

అలాగే తెలంగాణలో ముస్లిం జనాభా పరంగా అధిక శాతంగా ఉంటారు. ఇక్కడ ఎస్సీ, బీసీలూ ఎక్కువే. కాబట్టి ముస్లింల ప్రాతినిధ్యం అన్ని రంగాలతోపాటు రాజకీయంగానూ ఎస్సీ, బీసీలతో పాటు భాగం పంచుకునే అవకాశం ఉంటుంది. ఇలా ఏ రకంగా చూసినా ముస్లింలకు తెలంగాణ ఏర్పడడం అవసరం. చైతన్యవంతులైన ముస్లిం రచయితలుగా మేమంతా, మా సంఘం తరఫున తెలంగాణకు మద్దతు తెలుపుతున్నాం.

తెలంగాణ ముస్లిం రచయితల వేదిక కన్వీనర్‌గా
శ్రీకృష్ణ కమిటీకి సమర్పించిన పత్రం

# తెలంగాణా చరిత్రలోనైనా ముస్లింలకు న్యాయం జరగాలి

చిన్నప్పుడు పంద్రాగస్టుకు సంబరంగా ఊరుతిరిగేది. బడి ముందల జెండా ఎగరేసినంక సార్లు, ఊరిపెద్దలు స్వాతంత్ర్యం గురించి పోరాటయోధులగురించి చెప్తుంటే ఒళ్ళంతా ఊగిపోయ్యేది. పెద్దయినంక తెలిసింది, దేశవిభజన పేరుమీద లక్షలమంది బలయిన్రని. సరిహద్దుల్లో రక్తం యేరులైపారిందని. ఇట్లనే నవంబర్ ఒకటిన ఆంధ్రప్రదేశ్ అవతరణ అని హైద్రాబాద్ రాష్ట్రం ఆంధ్రప్రదేశ్‌లో కలిసిన రోజని చెపితే పాలమనసుతోని నిజమే అని నమ్మినం. తీరా చూస్తే -నిజాం పాలనను మించి ఆంధ్రపాలనను తెచ్చిన్రని తెలిసొచ్చె. ఈడగూడ నిజాం నిరంకుశ పాలన అని, రజాకార్ల దౌర్జన్యాలు అనే విన్నం గని పోలీసుయాక్షన్ పేరు మీద లక్షలమంది ముస్లింలను కాల్చి చంపేసిన్రని తెలియకపాయె. ఆ విషయం ఇప్పటోల్లకు అస్సలు తెల్వకుండ ఎందుకు దాచిపెట్టిన్రని ఇవాళ మేం అడగుతున్నం. అంతమందిని పొట్టనపెట్టుకోవడం వెనుక హిందూత్వ భావజాలమే పనిచేసిందనుకోవాల్నా? అంటే అప్పటినుంచే ఆ భావజాలం అంత బలంగా ఉందా? 'హైద్రాబాదు : ఆఫ్టర్ ద ఫాల్' అనే సంకలనంలో (సంకలన కర్త: ఒమర్ ఖాలిదీ) పోలీస్ యాక్షన్‌లో 50 వేల నుంచి రెండు లక్షలమంది ముస్లింలు చంపబడినట్లు ఒక రిపోర్ట్ (పండిట్ సుందర్‌లాల్, ఖాజీమొహమ్మద్ అబ్దుల్‌గఫార్) ఉంది. కానీ ఆ సంఖ్య ఆరు లక్షల వరకూ ఉండొచ్చని కొందరు చెబుతున్నారు. అందమైన ముస్లిం ఆడపిల్లల్ని, ఆడోళ్ళని తెలుగోల్లు మాయం చేసిన్రని, పోలీసులు వారాల తరబడి రేప్ చేసిన్రని, లూటీలు, దహనాలకు లెక్కేలేదని తెలిసినపుడు మన ప్రజాస్వామ్యం మీద అనుమానమేస్తుంది. పోలీస్ యాక్షన్ గురించి



మాట్లాడడం ఇప్పుడెందుకు అనే తెలంగాణ వాదులున్నారు, వాళ్లని ఎట్ల అర్థం చేసుకోవాలె? లక్షలమంది చంపడం, ఇండ్లను దోచుకోవడం వల్ల కొన్ని తరాలపాటు ముస్లింలు కోలుకోకుండా చేశారు. ఇవాల్టి తెలంగాణ ముస్లింల వెనకబాటుకి అది కూడా ఒక కారణం. ఎంతమందిని చంపిన్రనే దగ్గరి నుంచి ముస్లింల మానసిక హింస దాకా అప్పటి ఆ విషయాలన్నీ వెలికితీయాల్సిన అవసరముంది.

అయాల ఉర్దూ రాజభాష. ముస్లింలు తెలుగోల్లు ఉర్దూ చదివేది కదా! ఇండియాల కలపంగనే ఒక్కసారిగా ఉర్దూ తీసిపారేసి కోస్తా ఆంధ్రా తెలుగు అందరి మీదా రుద్దిన్రు. ప్రజాస్వామ్యం తెచ్చిన్రు గదా, మరి కనీసం ముస్లింల కోసమన్నా ఉర్దూను ఎందుకు కాపాడలే? అదే హైద్రాబాద్ రాష్ట్రం వేరుగానే ఉంటే కనీసం తెలంగాణన్న వేరుగా ఉంటే ఉర్దూ ఇయాల రెండోభాషగా ఉండేది కదా (ఏమో?). ఇయాల ఆంధ్ర పాలకులు ఉర్దూను తొక్కిపారేసి ముస్లింలు కూడా కోస్తాంధ్రంలనే జవాబు చెప్పేటట్టు తమ ఆధిపత్యాన్ని రుద్దుతున్రు. ఉర్దూను ఛీత్కరించడంతో తెలంగాణలో తెలుగు చదివినోల్లు లేక ఉద్యోగాలన్నింటిలో ఆంధ్రావాల్లను నింపటం మొదలయింది. అప్పటినుంచి మొదలయిన ఆంధ్రావలస ఇప్పటికీ ఆగలేదు. ఇక్కడ ముస్లింలకు కూడా పెద్ద ఎత్తున అన్యాయం జరిగింది. కేవలం ఉర్దూ మాత్రమే వచ్చిన అప్పటి ఉద్యోగస్తులకు తెలుగు లేక ఇంగ్లీష్ నేర్చుకోవాలని అప్పటి ప్రభుత్వం కొన్ని రోజుల గడువు ఇచ్చింది. మరి నేర్చుకోలేని వాళ్లు ఉద్యోగాల నుంచి తీసివేయబడ్డారా? లేక ఏం జరిగిందనే విషయం తెలియదు. అప్పటిదాకా ఉర్దూ మీడియంలో చదువుకున్న యువతరం ఏమయ్యారు? అప్పటినుంచి తెలుగు మీడియం ప్రవేశపెడితే మరో 15 నుండి 20 ఏళ్ళకు కదా విద్యావంతులయ్యేది, ఈ మధ్య కాలమంతా ముస్లింలు, తెలుగోల్లు అన్యాయం పాలయినట్లే కదా? ప్రజాస్వామ్యం పేరు మీద ఇంత దోపిడి, ఇంత అన్యాయానికి పాల్పడడమేమిటి?

మొత్తం ఇండియాలో ఉర్దూ మాట్లాడేవాళ్లు కోట్లమందే ఉంటారు. ఇన్ని భాషాప్రయుక్తరాష్ట్రాలు ఏర్పడ్డయి, మరి ఒక్క ఉర్దూ రాష్ట్రమైనా ఎందుకు లేదని ప్రశ్నించుకోవడం దేశద్రోహం ఏం కాదు కదా! దేశ విభజనా భారాన్ని ఇక్కడి ముస్లింల మీద మోపి ఆ విషయం తప్పించడం సరైందా? ఉర్దూ మాట్లాడేవారే ఒక్క తాన లేకుండా దేశవ్యాప్తంగా పరుచుకుని ఉన్నారు కదా అనే సాకు సరైందా? ఎమ్ఐఎమ్ ఉర్దూ రాష్ట్రం కావాలని 1956లో డిమాండ్ చేసి ఉంటే ఎంత

బాగుండు.

ఇవాళ హైద్రాబాద్‌లోని తెలంగాణలోని ఉర్దూ మాట్లాడేవారు, ఉర్దూ సాహిత్యకారులు ఒక వేరే ప్రపంచంగా బతుకుతున్నరు. వాళ్లను మిగతా ప్రపంచంతో కలిపే ప్రయత్నమేది జరుగుతలేదు. వాళ్ళతోనూ వేరే ప్రపంచం కలవడం లేదు. వాళ్ళ సమస్యలు, వాళ్ళ బాధలు వేరేగా ఉన్నాయి. ఆ అంతరాన్ని, పెరగకుండా చూడాల్సి ఉంది.

తెలంగాణ హిస్టరీని రికార్డు చేసేటప్పుడు విధిగా ఉర్దూ మాట్లాడేవాళ్ళ ప్రాతినిధ్యం ఉండేలా చూడాలి. వాళ్ళ ఫీలింగ్స్‌ని పరిగణనలోకి తీసుకోవాలి. ఉర్దూను తెలంగాణ ద్వితీయభాషగా గుర్తించాలి.

తెలంగాణ గురించి కమ్యునిస్టులు, ఆంధ్రవలస పాలకులు రాసిన చరిత్రే ఆధారం కావడం (?)తో అసలు విషయాలు ఎన్నో మరుగున పడ్డాయి. వెలుగులోకి రావాలసిన విషయాలు చాలా ఉన్నాయి. అందులో కొన్ని ముఖ్యమైన విషయాల్ని 'ముల్కి' ముస్లిం ప్రత్యేక సంచికలో సంగిశెట్టి శ్రీనివాస్ రాసిండు. 'నిజాం చరిత్రకు చెదలు' పేరుతో రాసిన ఈ వ్యాసంలో ముస్లింల మనస్సులో అనుకున్నప్పటికీ బైటికి చెప్పలేని కొన్ని విషయాలతో పాటు ఎన్నో కొత్త కోణాల్ని రికార్డ్ చేసిండు. దానిపట్ల ఎంతో వ్యతిరేకత వ్యక్తం కావడం ఆశ్చర్యం కలిగించింది. రాజరికాన్ని సపోర్ట్ చేయడంగా కొందరు మాట్లాడిన్రు. నిజాంలది రాజరికమే.(ఆ పేరు మీద రెడ్డి, వెలమ తదితర భూస్వాములు రాజ్యం చేసిన విషయం మరుగున పెడు తున్నారు.) ఇవాళ ప్రజాస్వామ్యం పేరు మీద కోస్తాంధ్రులు నియంతృత్వం చెలాయిస్తుంటే, రాజరికం కన్నా ఎక్కువ దౌర్జన్యాలు చెలాయిస్తుంటే ఆ విషయం చెప్పొద్దంటే ఎట్ల? పైగా తమ కులాలకు చెందిన వాళ్లు రాజులుగా ఉన్నా ఆయా కులాల వాళ్ళు మీరు రాజులు కదా అనే నిందని మోయడంలేదు. ఇండియాను క్రిష్టియన్లు పరిపాలిస్తే ఇవాళ క్రిష్టియన్లను మీరు పాలకులు కదా అని అడగడం లేదు. కానీ ముస్లింల విషయానికొస్తే మాత్రం 400 ఏండ్లు పాలకులుగా ఉన్నారు కదా అని కొన్ని బీసీ సంఘాలు ముస్లిం రిజర్వేషన్లను వ్యతిరేకించాయి. అట్లే ఎంతోమంది అలా వాదిస్తుంటారు. ఆఖరికి తెలంగాణ వాదుల్లో కొందరు గూడా అయ్యే మాటలు మాట్లాడటం విన్నప్పుడు చీదరింపు కలిగింది. ఏ కులంగానీ, మతం గానీ, జాతీగానీ ఇట్లామీరు పాలకులు కదా అనే భారాన్ని మోయడం లేదు, ఒక్క ముస్లింలు తప్ప.

పాలకులు అన్న ఈ భారాన్ని మోస్తున్న ఈ ముస్లింలకు సెప్టెంబరు 17



తెలంగాణ విమోచన దినోత్సవాన్ని బిజెపి నిర్వహిస్తోన్న తీరు వల్ల కూడా మరింత నష్టం కలుగుతున్నది. ఇట్లాంటి సందర్భంలో సెప్టెంబరు 17ను ఉత్సవంగా టిఆర్‌ఎస్ నిర్వహించకుండా ఉండటం సరైందనిపించింది. కానీ కొన్ని తెలంగాణ సంఘాలు ఈ విషయాన్ని విస్మరించడం విస్మయం కలిగించింది. కోస్తాంధ్ర వలసవాద పాలన నుంచి తెలంగాణకు విమోచన కలగనంతవరకు సెప్టెంబర్ 17 ను ఉత్సవంగ జరపడంలో అర్థం లేదు.

ఇవాళ రాజకీయంగా జరుగుతున్న ఉద్యమం పై ముస్లింలకు అనేక అనుమానాలు తలెత్తుతున్నాయి.

రాజకీయ ఉద్యమం సాహిత్యరంగంలోని ఒక వర్గాన్ని ప్రభావితం చేస్తుండటం ఇవాల్టి విషాదం. టిఆర్‌ఎస్ మొదలైంతరువాత బిజెపి నుంచి చీలిపోయి టీఎస్ఎస్ గా ఏర్పడ్డ నరేంద్ర పార్టీ టీఆర్‌ఎస్‌లో కలవడం ముస్లింల పట్ల వివక్ష మొదలు కావడానికి కారణమైంది. (ముస్లింలకు కూడా టీఆర్‌ఎస్ పై అనుమానం మొదలైంది.) అంతదాకా ముస్లింల జనాభా తెలంగాణలో గణనీయంగా ఉందని భావించి 12 శాతం రిజర్వేషన్ కల్పిస్తామని ప్రకటించిన టీఆర్‌ఎస్ ఆ వాయిస్‌ను తగ్గించింది. అట్లే సీట్ల కేటాయింపులోనూ అన్యాయం చేసింది. ఇప్పటికీ ఆరెస్సెస్ వాడినే అనే నరేంద్ర రెండవ నాయకుడుగా ఉండటంతో ముస్లింలలో ఒక సందిగ్ధం నెలకొంది. తెలంగాణ వస్తే బిజేపి ప్రాబల్యం పెరుగుతుందని జరిగిన ఒక ప్రచారం కూడా ఇందుకు కారణం. పైగా అసెంబ్లీలో ముస్లింల ప్రతినిధిగా మాట్లాడే ఎమ్‌ఐఎమ్ కూడా తెలంగాణ పట్ల మొదట వ్యతిరేకంగా మాట్లాడటం కూడా మరో కారణం. కానీ ఎమ్‌ఐఎమ్ ముస్లింల ప్రతినిధి కాదని ఇక్కడ అందరం గుర్తుంచుకోవాలి. ఒక్క పాత బస్తీలో తప్ప మిగతా తెలంగాణ జిల్లాల్లో ముస్లింలు ఎమ్‌ఐఎమ్‌తో లేరు. నరేంద్ర తదితర ఆరెస్సెస్‌వాదుల (రాజకీయ పార్టీలతో సంబంధం లేని ఆరెస్సస్ వాదులు కూడా) వల్ల ఇవాళ ముస్లింల పట్ల ఒక వివక్ష, మౌనం చూస్తున్నాం. చివరికిదే భావజాలం సాహిత్యానికి కూడా పాకి మిగతా ఐడెంటిటీ ఉద్యమాలతో పాటు ఒక ఉద్యమంగా నడుస్తున్న తెలంగాణ వాదం ముస్లింవాదం పట్ల వివక్ష చూపుతూ వస్తున్నది. వేదికల మీద ముస్లింలు లేకుండానే నడిపిస్తున్నరు. ఒక్క తెలంగాణ సాంస్కృతిక వేదిక కాస్త ఇందుకు మినహాయింపుగా కనపడుతున్నది.

సాహిత్య ఉద్యమంతోపాటు తెలంగాణ రాజకీయాలు కూడా ముస్లింలపట్ల స్పష్టమైన ప్రకటనలు (చేయాలి) చేసేలా తెలంగాణ ముస్లింల ప్రాముఖ్యతను

రికార్డ్ చేయాల్సిన అవసరం ఉంది.

తెలంగాణ హిస్టరీ రికార్డ్ చేసే క్రమంలో ముస్లింల కోణం నుంచి లెక్కలోకి తీసుకోవలిసిన అంశాలు క్లుప్తంగా:

1. పోలీస్‌యాక్షన్‌లో ఎన్ని లక్షలమంది ముస్లింలను హత్యచేశారో, ఎంతమంది ముస్లిం స్త్రీలను, అమ్మాయిల్ని రేప్ చేశారో, మాయం చేశారో, ఎన్ని ఇండ్లు దోచుకున్నారో, ధ్వంసం చేశారో విస్తృత అధ్యయనం జరగాలి. అందుకు ప్రతిగా ముస్లింలను ఆదుకోవాలి.

2. తెలంగాణకు సంబంధించి హిస్టరీ దగ్గర్నించి అన్ని రంగాల్లో ఉర్దూ మాట్లాడేవాళ్ల ప్రాతినిధ్యం ఉండాలి. ముస్లింల ప్రాతినిధ్యం ఉండాలి.

3. ఉర్దూ తెలంగాణ ద్వితీయభాషగా గుర్తించాలి.

4. తెలంగాణ గురించి కమ్యునిస్టులు, ఆంధ్రవలస పాలకులు రాసిన చరిత్ర ఆధారంగా ముస్లింలను చూడొద్దు. తెలంగాణలో ముస్లింలు ఒక భాగం అని నమ్మేవాళ్ళు కొత్తగా రాసే చరిత్ర ఆధారంగా చూడాలి.

5. శ్యాంసుదర్ అనే దళిత నాయకుడు హైద్రాబాద్ ప్రత్యేక దేశంగా ఉండాలని యుఎన్‌ఓతో మాట్లాడిండని, ఇంకో మూడు రోజులు గనుక పోలీసు యాక్షన్ జరగకపోయి ఉంటే హైద్రాబాద్‌ను ప్రత్యేక దేశంగా యుఎన్‌ఓ ప్రకటించేదని చెప్తున్నరు. అట్ల జరిగివుంటే ఇండియా అనే ఒక దేశం మరో దేశమైన హైద్రాబాద్ మీద దాడి చేసినట్లు అయ్యేది. ఇదిలా ఉంటే హైద్రాబాద్ సంస్థానాన్ని ఇండియన్ యూనియన్‌లో కలపడం వలన దళితులకు అన్యాయం జరుగుతుందని ఫీలయిన శ్యాంసుందర్ చెప్పిన కారణాలేంటి? అవి నిజమయ్యాయా?

6. నిజాంరాజుల పాలనను 'ముస్లిం పాలన' అనడాన్ని వ్యతిరేకించాలి. ముస్లింలు 400 ఏళ్ళ పాలకులనే ప్రచారాన్ని ఖండించాలి.

7. నిజాం రాజ్యంలో 'నిరంకుశత్వం' నడిపిన రెడ్లు, వెలమలు తదితర భూస్వాముల గురించిన విషయాలు కూడా చర్చకు రావాలి. ఎవరి నిరంకుశత్వం ఎంత అనేది తెలియాలి.

8. ఉర్దూలో, పార్శీలో ఉండే సోర్సెస్ (ఆధారాలు) వెలికి తీయడం ద్వారా అనేక అబద్ధపు ప్రచారాలు, అసలు నిజాలు వెలుగులోకి వస్తాయి. కనుక ఆ ప్రయత్నం జరగాలి.

9. ఖాసిం రాజ్వి ఆటోబయోగ్రఫీ పాకిస్తాన్‌లో ముద్రణ జరిగింది. దాన్ని రిఫర్ చేయడం జరిగితే అతను రజాకార్ ఉద్యమం చేయడానికి అసలు కారణాలు



తెలిసే అవకాశం ఉంది. ఆ ప్రయత్నం జరగాలి.

10. నిజాం కాలంపై విదేశాలలో సైతం రీసెర్చ్‌లు జరుగుతుంటే ఇక్కడ ఇంతటి వివక్ష, దుష్ప్రచారం జరుగుతుండటాన్ని చర్చకు పెట్టాలి.

11. కోస్తాంధ్రలో దళిత క్రైస్తవులు ఎక్కువగా ఉన్నట్లుగా ఇక్కడ ముస్లింలు ఎక్కువగా ఉన్నారు. మరి దళితుల నుంచే ఎక్కువగా ముస్లింలుగా మారిన్రా అనే విషయంలో అధ్యయనం జరగాలి. దీన్ని లెక్కలోకి తీసుకోవాలి.

12. ఆంధ్రుల వలస వల్ల చిల్లర వ్యాపారాల దగ్గరనుంచి ఉద్యోగాల దాకా ముస్లింలు అన్యాయానికి గురయిన, గురవుతున్న విషయం రికార్డ్ కావాలి.

13. హైద్రాబాద్‌లాంటి చోట్ల పోలీసు శాఖలో ముస్లింల శాతం మరీ తక్కువగా ఉన్నది. దీనివల్ల ఎంతో వివక్ష కొనసాగుతుంది. ఇది ఏ భావజాలం వల్ల జరుగుతున్నది? దీని వెనుక రాజకీయాలేంటి? పోలీసుల భర్తీలో ముస్లింల పట్ల వివక్ష గురించి చర్చ జరగాలి.

14. ముస్లింలకు, తెలుగోల్లకు మధ్య ఏఏ కారణాల వలన అంతరం పెరుగుతున్నదో చూడాలి.

డిసెంబర్ 2006, 'తెలంగాణ చరిత్ర పునర్నిర్మాణం' నుంచి

# తెలంగాణ ఉద్యమానికి ముస్లింల అవసరం

తెలంగాణ ఉద్యమం పతాకస్థాయిలో ఉన్న ఈ సమయంలో తెలంగాణ ముస్లింలను ఉద్యమంలోకి తీసుకురావడానికి సరైన ప్రయత్నం జరిగిందని మేము భావించడంలేదు. వారికున్న భయాలను తొలగించే ప్రయత్నం జరగలేదు. తెలంగాణలో పెద్ద సమూహంగా ఉన్న ముస్లింలను ఉద్యమంలో భాగం చేయడంవల్ల ఉద్యమం మరింత విజయవంతమయ్యే అవకాశం ఉంది. కాబట్టి ముస్లిం ఆలోచనాపరులుగా కొన్ని అంశాలను తెలంగాణ మేధావులతో పంచుకునే ప్రయత్నమిది..

*కిసీ ఖౌమ్‌కో బర్‌బాద్ కర్‌నా హైతో*

*పహ్‌లే ఉస్‌కీ జబాన్ ఖీంచ్‌లో..!* అన్నట్లే తెలంగాణ ముస్లింల భాషను గుంజి నానా ఇబ్బందులపాలు చేసిన్రు ఆంధ్రా వలసవాదులు. ఇంట్ల ఉర్దూ, గల్లీలో తెలంగాణ తెలుగు, బడికెళ్తే కోస్తాంధ్రా తెలుగు. ముస్లింల ఈ ఇబ్బందిని తీర్చే సరైన హామీ దొరికలేదు.

ఇండియన్ యూనియన్‌లో హైదరాబాద్ విలీనం తర్వాత ఎంతోమంది ఉద్యోగాలు పోయాయి. అప్పటికి ఉర్దూ చదివిన, చదువుతున్నవాళ్లు అన్యాలమైపొయిన్రు. వాళ్ల జాగల ఆంధ్రావాల్లు ఉద్యోగాల్లో భర్తీ అయిన్రు. మరి అక్కడ దెబ్బతిన్న మనుషుల నొక్సాన్ ఎవరు పూడ్చాలె? 1956లో తెలంగాణపై ఆంద్రోళ్ల ఆక్రమణ తెలంగాణ ముస్లింలు ఇంత గరీబోళ్లుగా మారడానికి ముఖ్య కారణమైంది. అప్పటికి ఆంధ్రప్రదేశ్ సెక్రటేరియేట్‌లో 35 శాతంమంది ముస్లింలు ఉండగా ఇవాళ వేళ్లమీద లెక్కబెట్టేంతమందే ఉన్నరు. ప్రభుత్వ కార్యాలయాల్లోనూ, ఇతర సంస్థల్లోనూ ఇదే పరిస్థితి నెలకొన్నది. ఈ విషయాన్ని ఎవరూ గుర్తించినట్లు కనిపించదు.

పాతబస్తీలో లక్షలమంది ముస్లింలు గరీబు గబ్బుకొడుతున్నరు. అరబ్బు షేకులకు బిడ్డల్ని అమ్ముకుంటున్నరు. వేలమంది ముస్లింలు అరబ్బు దేశాల్లో పాచిపని, డ్రైవరీ, తోటపని చేయడానికి పోతున్నరు. కారణం ఏమిటి? కారణం



ఎవరు? పాలమూరు వలసల గురించే తెలుసు మనకు. దుబాయికి వలసపోతున్న పాలమూరు ముస్లింల గురించి ఎన్నడన్న ఆలోచిస్తిమా?

హైదరాబాద్ పాతబస్తీయే కాదు తెలంగాణ జిల్లాల్లోని పాతబస్తీలన్నీ పాతబస్తీలుగనే ఉన్నయెందుకు?

రోడ్డుసైడు చిల్లర బేరాలకే మా ముస్లింలు వేలాడుతున్నరు. హరేక్‌మాల్-ఫుట్‌పాత్ కేకల్లై, చాయ్-పాన్‌డబ్బాలై డ్రైవర్లై మాత్రమే ముస్లింలు బతుకులీడుస్తున్నరు. పది రూపాలకే అన్నం పెట్టే ఇరానీ హోటళ్లు మాయమవుతున్నయ్. డబ్బు సంచుల ఫ్రూట్ మార్కెట్లవల్ల వందలాది ముస్లింల పండ్లబండ్లు లేచిపోతున్నయ్. ఇవాళ హైదరాబాద్‌లో ఉర్దూ వినిపించడంలేదు. ఉర్దూ చదివిన, చదువుతున్న విద్యార్థులు అనేక ఇబ్బందులు పడుతున్నరు. ఇదంతా ఎందుకు?

వీటన్నింటికీ కారణం వలసాంధ్రుల పాలనే. ముస్లింల మీద ప్రేమలేని పరాయి ప్రాంతీయుల పాలనే. వీరు 50 ఏళ్లుగ ముస్లింల అభివృద్ధిని ఏమాత్రం పట్టించుకోలేదు. ముస్లింలు ఛాందసంలో మగ్గడానికి మాత్రమే సౌకర్యాలు కల్పిస్తారు. ముస్లింలు చదువుకునే, బాగుపడే పనులు మాత్రం చేయరు! అదేకోవలో పాతబస్తీలో తగిన ప్రత్యామ్నాయం లేని కారణంగా మనుగడలో ఉన్న ఎంఐఎం మా ప్రతినిధి కాదు. మిగతా తెలంగాణ ముస్లింలు ఎంఐఎంతో లేరు. ముస్లింలు నిరక్ష్యరాస్యులుగా, వెనుకబడినవారుగా, గరీబులుగా ఉంటేనే తాము మనుగడలో ఉంటామని ఎంఐఎంకు తెలుసు. అందుకే మతపరమైన విషయాలకు స్పందించినంత తీవ్రంగా అభివృద్ధికి సంబంధించిన విషయాలపట్ల ఆ పార్టీ స్పందించదు.

ఆంధ్రా ఆధిపత్యం వల్లే ముస్లింల రాజకీయ ప్రాతినిధ్యం తగ్గింది. తెలంగాణలో దాదాపు 80 (?) అసెంబ్లీ, 9 పార్లమెంటు నియోజకవర్గాల్లో ముస్లింలు గెలుపోటముల్ని నిర్ణయించే స్థాయిలో ఉన్నారు. అయినా వారిని ఓటుబ్యాంకుగానే ఉపయోగించుకుంటున్నారు. ముస్లింలు గెలిచే కొన్ని స్థానాలు ముస్లింలకు కేటాయించకుండా చూస్తున్నారు. లేదా రిజర్వుడు స్థానాలయ్యేలా చూస్తున్నరు.

తెలంగాణలో కలగలిసిపోయిన తెలుగువాళ్ల-ముస్లింల సంస్కృతి ఉండేది. ఇవాళ పరిస్థితి మారిపోయింది. ఆంధ్రా వలసవాదం వల్లే ఇక్కడ హిందూత్వవాదం పెరిగింది. పైగా తెలంగాణ వస్తే బిజెపి పెరుగుతుందని ముస్లింలను భయపెడుతున్నారు. ఎక్కువ రాజకీయపార్టీలున్న చోట, ముఖ్యంగా కమ్యూనిస్టు

పార్టీలు, మావోయిస్టు పార్టీలున్న చోట, ప్రజా, కుల సంఘాలున్నచోట బిజెపి బలం పుంజుకునే అవకాశం తక్కువ. ఎన్నికల ఫలితాలను ప్రభావితం చేయగలిగేంత స్థాయిలో ముస్లిం జనాభా ఉన్న తెలంగాణలో బిజెపి పెరగడానికి అవకాశం లేదు.

పైన పేర్కొన్న విధంగా ముస్లింలు భాషాపరంగా, సంస్కృతిపరంగా, సాంఘికపరంగా, ఆర్థికంగా, రాజకీయంగా చితికిపోయారు. కాబట్టి ముస్లింలను ప్రేమించే, ముస్లింల అభివృద్ధిని కాంక్షించే తెలంగాణ కావాలె. ఆ వైపుగా అడుగులు వేయాలని కోరుతున్నాం.

**ముస్లింల తరపున కొన్ని డిమాండ్స్:**

**1. అసెంబ్లీ, పార్లమెంటు స్థానాలకుగాను ముస్లింలకు 15 శాతం సీట్లు కేటాయించాలి. ముస్లిం స్త్రీలకు తగిన ప్రాధాన్యమివ్వాలి.**

**2. జనాభా ప్రాతిపదికన రిజర్వేషన్ కల్పిస్తామనే హామీ ఇవ్వాలి.**

**3. ఉర్దూను రెండవ అధికార భాషగా ప్రకటిస్తామనే నమ్మకాన్ని ఇవ్వాలి.**

**4. చదువులో ముస్లింలు పూర్తిగా వెనకబడి ఉన్నారు కాబట్టి వారికి ఇంగ్లీషు మీడియం స్కూళ్లు, రెసిడెన్షియల్ స్కూళ్లు, హాస్టళ్లు, కాలేజీల ఏర్పాటుకు హామీ ఇవ్వాలి.**

**5. సచార్ కమిటీ సిఫార్సులు అమలు చేస్తామనే హామీ ఇవ్వాలి.**

**6. పోలీసు తదితర భద్రతా శాఖల్లోనూ, అన్ని రంగాల్లోనూ ముస్లింలకు తగిన ప్రాతినిధ్యం కల్పించాలి.**

**7. ఆంత్రొపాలజీ ప్రకారం ఇక్కడి ముస్లింలు 90 శాతం మంది ఎస్సీ, ఎస్టీ, బీసీల నుంచే ముస్లింలుగా మారినవాళ్లు. ఆ విషయాన్ని విస్తృతంగా ప్రచారం చేస్తూ ఎస్సీ, ఎస్టీ, బీసీలు- ముస్లింల మధ్య సోదరభావాన్ని పెంపొందించాలి.**



# మతతత్వ తెలంగాణ మాకెందుకు?

పాలమురు ఎన్నికల సందర్భంగా కొన్ని కారణాలు చూపుతూ 'రజాకార్ల కాలం గుర్తుకువస్తే ఎందుకు తప్పుపట్టాలి?' అంటూ మందాడి సత్యనారాయణరెడ్డి చేసిన వాదన ఏ రకంగా చూసినా సమర్థనీయం కాదు. పాలమూరు ఎన్నికల ప్రచారంలో ముస్లింలకు ఓటు వేస్తే రజాకార్లకు వేసినట్టేనని బిజెపి ప్రచారం చేయడం దుర్మార్గం. మొదటి నుంచి కూడా తెలంగాణలో రజాకార్ల ప్రస్తావన మాటిమాటికి తెస్తూ ముస్లింలపై వ్యతిరేకత పెంచే ప్రయత్నం బిజెపి చేస్తూవస్తున్నది. రజాకార్ల విషయంలో నిజానిజాలు ఇప్పటికైనా తెలంగాణ ప్రజలకు తెలియాల్సిన అవసర ముంది. ముందుగా గ్రహించాల్సింది రజాకార్లకు కానీ నిజం పాలకులకుగానీ ప్రస్తుత తెలంగాణ ముస్లింలకు ఏమీ సంబంధంలేదన్న విషయం. కాకతీయులకో, రెడ్డిరాజులకో, మరొకరికో ఇప్పుడున్న ఆయా కులస్తులకు సంబంధం ఉంటుందా? బ్రిటిష్ వారితో ఇక్కడి క్రైస్తవులకు ఏమిటి సంబంధం? కేవలం ముస్లింలకు మాత్రమే నిజాం రాజులతో సంబంధం కలిపి రజాకార్ల ప్రస్తావన తెచ్చి విమర్శించడం సరైంది కాదు. మరొక విషయం, రజాకార్లంటే కేవలం ముస్లింలు అనే ప్రచారం కూడా అవాస్తవం. రెడ్లు, వెలమలు, బ్రాహ్మణ దొరల దగ్గరి గూండాలు రజాకార్ల అవతారమెత్తిన విషయం మరువొద్దు. వారిలో ముస్లిం ముస్లిమేతరులు కూడా ఉండేవారన్న సంగతి మరుగున పడుతోంది. దొరలు చేయించిన అకృత్యాలన్నీ రజాకార్ల పేరు మీద ముస్లింలకు ఆపాదిస్తూ ముస్లిం వ్యతిరేకతను పెంచే ప్రయత్నం కావాలనే బిజెపి, దాని అనుబంధ సంస్థలు చేస్తున్నాయి. ఇవి కేవలం ముస్లింలకు వ్యతిరేకంగా ముస్లిమేతరులను రెచ్చగొట్టి ఓట్లు దండుకుని సీట్లు పెంచుకునే ఎత్తుగడ మాత్రమే.

తెలంగాణ ఉద్యమంలో ఇంకొక ముఖ్యవిషయం ఏమంటే 2009 ఎన్నికల్లో నిజామాబాద్‌లో డి.శ్రీనివాస్ ముస్లింలకు మద్దతుగా మాట్లాడుతూ ఓ తీవ్రమైన కామెంట్ చేశాడన్న నెపంతో ముస్లిమేతరులనంతా రెచ్చగొట్టి డిఎస్‌ను ఓడించి తమ అభ్యర్థిని గెలిపించుకుంది బిజెపి. తెలంగాణ కోసం రాజీనామాలు చేసినప్పుడు వచ్చిన ఉప ఎన్నికల్లో డిఎస్ గట్టి జాగ్రత్తలు తీసుకున్నారు. దాంతో

ముస్లింలు తెలంగాణకు అనుకూలమా కాదా అనే విషయాన్ని తెరమీదకు తెచ్చి ముస్లింలను ఇరుకున పెట్టారు. దాంతో మనసు చంపుకుని ముస్లింలు తెలంగాణ కోసం బిజెపికి ఓటు వేశారు. ఎంతకు మనసొప్పని వారు ఓటు వేయకుండా ఉండిపోయారు. దాంతో బిజెపి గెలిచింది. అప్పుడు కనీసం ముస్లింలకు కృతజ్ఞతలు కూడా చెప్పని నియ్యతి బిజెపీది. ఏరు దాటగానే తెప్ప తగలేసిన చందంగా మళ్ళీ ఎప్పటిలాగే ముస్లిం వ్యతిరేకతను ప్రచారం చేస్తూనే వస్తున్నారు. నిజానికి ఆ ఋణం తీర్చుకునే అవకాశం మహబూబ్‌నగర్‌లో వచ్చింది. కానీ అలాంటి అవకాశం ఏ మాత్రం ఇవ్వకపోగా, కేసీఆర్ తమతో చర్చించలేదని, జెఏసీకి మాట మాత్రంగానైనా చెప్పకుండానే పోటీకి పెట్టారని వంకలు చెబుతూ బిజెపి పోటీకి దిగింది. మిగతా విషయాలకన్నా టీఆర్ఎస్ ముస్లిం అభ్యర్థిని పోటీకి దించడమే బిజేపి పోటీకి అసలు కారణం. పోటీకి దిగడమే కాకుండా జెఎసి వాళ్లతో మేనేజ్ చేసుకుని, కేసీఆర్ మీద వ్యతిరేకంగా ఉన్న శక్తులన్నింటినీ కలుపుకుని, 'రెడ్డి' కార్డు ఉపయోగించి, అగ్రవర్ణాలన్నీ ఏకమై చివరికి ముస్లిం అభ్యర్థిని ఓడగొట్టడం తెలిసిందే.

ఈ మొత్తం ప్రహసనంలో అందరూ కలిసి ముస్లింలను ఒంటరి చేసిన వైనం భయం గొలుపుతున్నది. తెలంగాణ ఉద్యమంలో అన్ని కులాలు, మతాలు, పార్టీలు, శక్తులందరూ తెలంగాణ కోసం ఏకమయ్యారు అనే విశ్వాసంలో ఇప్పుడు బిజెపియె ఒక చీలిక తీసుకువచ్చింది. మరి మిగతా శక్తులు ముస్లింల గురించి ఏమాలోచిస్తున్నాయి? అందరు శక్తుల్లో ముస్లింలు కూడా భాగమా కాదా? బిజెపి మద్దతుకోసం ముస్లింలను వొదులుకోవడానికైనా జెఎసి, మిగతా శక్తులు సిద్ధపడుతున్నయా? అన్నది ముఖ్యమైన ప్రశ్న. లేదంటే ప్రజా ఫ్రంట్ మౌనంగా ఎందుకుంది? కృష్ణ మాదిగ లాంటివారు బిజెపికి ఎందుకు మద్దతు పలికారు? కేవలం కేసీఆర్ మీది వ్యతిరేకతే కారణమంటారా? నిజానికి- ముస్లిం అభ్యర్థికి వ్యతిరేకంగా బిజేపి చేస్తున్న విషప్రచారం మొత్తంగా ముస్లింల మనోభావాలను గాయపరుస్తున్నదని, ముస్లిం అభ్యర్థి ఓడిపోవడం వలన మొత్తంగా తెలంగాణ ముస్లింలు తెలంగాణ ఉద్యమ శక్తులను అనుమానించే పరిస్థితి తలెత్తే అవకాశం ఉన్నదని అప్పటికే ప్రచారమైఉన్నది. అయినప్పటికీ జెఎసి మౌనం, స్థానిక జెఏసీ బిజెపీ వైపు మొగ్గడం, న్యూడెమొక్రసి, మాదిగదండోరా తదితర శక్తులన్నీ బిజెపీకే మద్దతునివ్వడం ఎలాంటి సంకేతాలనిస్తుంది?

పైగా ఇప్పుడు టిఆర్ఎస్ కు బిజెపీనే ప్రత్యామ్నాయమని, బిజెపి అధికారంలో



కొచ్చి తెలంగాణ ఇస్తుందని బిజెపీ ప్రచారం చేసుకుంటోంది. దీని వల్ల ముస్లింల మీద విషప్రచారంతో గెలిచే పార్టీ, ఒక మతతత్వ పార్టీ ఇచ్చే తెలంగాణలో ముస్లింల పరిస్థితి ఎలా ఉంటుందో నన్న భయాందోళనలకు ముస్లింలు గురి కావడంలో అతిశయోక్తి ఏముంది? ముస్లింలుగా మాకు 'మతతత్వ తెలంగాణ' అవసరం లేదు. ప్రజాస్వామిక, సెక్యులర్ పార్టీలు పోరాడి తెచ్చుకునే తెలంగాణ కావాలి. విషప్రచారంతో, అబద్ధపు ప్రచారాలతో ముస్లింల మనోభావాలు గాయపరిచే క్రూర రాజకీయాలను అందరూ వ్యతిరేకించాలని కోరుతన్నాం.

కాబట్టి ఇన్నాళ్ళు మార్క్సిస్టులుగా, బహుజన దృక్పథంతో పనిచేస్తున్నవారుగా ఎంతో చైతన్యం ప్రదర్శించిన వారు ఒక మతతత్వ పార్టీ ఇచ్చే తెలంగాణ వల్ల ముస్లింల, క్రైస్తవుల కాళ్ళకింది భూమిని కోతకు గురిచేయవద్దని మనవి. 2014 తరువాత బిజెపీ గెలిస్తే తెలంగాణ ఇస్తుందని  జరిగే ప్రచారం వలన మొదటికే మోసం జరిగే అవకాశం ఉంది. కేంద్రంలో ఎన్‌డిఎ అధికారంలో రాకపోతే తెలంగాణ మొత్తానికే వెనక్కు పోయె అవకాశం ఉంది. అంతే కాక తెలంగాణలో ఇన్నేసి పార్టీలు, ఇన్నేసి ప్రజాసంఘాలు, విప్లవసంఘాలు-పార్టీలు ఉండికూడా చివరికి ఒక మతతత్వ పార్టీమీద ఆధారపడే దౌర్భాగ్య పరిస్థితిని కల్పించుకోవద్దని కూడా మనవి.

టీఆర్ఎస్ కూడా ఎలాగోలా 2014 వరకు లాగి మరోసారి తెలంగాణపై బేరసారాలు ఆడొచ్చని భ్రమిస్తూ ఉండవచ్చు. 2014 వరకూ లాగితే ముస్లింలతో పాటు అంబేడ్కరిస్టులంతా తెలంగాణాను వ్యతిరేకించే అవకాశముందని గ్రహించడం అవసరం. ఎంత నీచానికైనా ఒడిగట్టే ప్రచారాలతో రెచ్చగొట్టి ఓట్లు పొందాలనుకునే బిజెపీ కుట్రలకు టీఆర్ఎస్ కూడా బలిఅయ్యే అవకాశం ఉంది. ఇవన్నీ దృష్టిలోఉంచుకుని ఉద్యమం వేడెక్కిన ఈ సందర్భంలోనే తెలంగాణ ఏర్పాటుకు మరింత వత్తిడి పెంచాల్సిన అవసరం ఉంది. అప్పటికీ కాంగ్రెస్ కదలకుంటే మరింత పెద్దఎత్తున సకల జనుల సమ్మె ద్వారా సర్వం స్థంభింపచేసి తెలంగాణ సాధించుకోవడం ఒక్కటే మార్గం. లేదంటే తెలంగాణలోని అతిపెద్ద సమూహమైన ముస్లింలు తెలంగాణోద్యమానికి దూరమయ్యే ప్రమాదముంది. బిజెపి వ్యతిరేక శక్తులంతా కూడా దూరమవుతారు. ఆ పరిస్థితిని నివారించడానికి అందరం ఇప్పుడే ప్రయత్నించాలి.

(ముస్లిం విద్యావంతుల-రచయితల వేదికల తరుఫున)

*2 ఏప్రిల్ 2012, ఆంధ్రజ్యోతి*